శ్రీ లక్ష్మీనారాయణ గ్రంథమాల ౨ పుష్పము.

# నన్నయభట్టు

## (పద్యకావ్యము)



గ్రంథకర్త, ప్రకాశకుఁడు.

అష్టావధాని: చిలుకూరి రామభద్రశాస్త్రి

వ్యాకరణవిద్యాప్రవీణ, భాషాప్రవీణ,
శ్రీ వీరేశలింగాస్తికోన్నతపాఠశాలలో
ఆంధ్రోపాధ్యాయుఁడు.

రాజమహేంద్రవరము.

వెల 1-4-0

శ్రీ మహాగణపతయే నమః

# విన్నపము

## కష్టే సత్ఫలమాప్నుయాత్తనుజనః

మహాశయులకు.

ఈ నన్నయభట్టు చరిత్రము, నన్నయభట్టుపై నాకున్న భక్తికి లక్ష్యమని వేఱుగాఁ జెప్పనక్కఱలేదు. ఇట్టి మహనీయుని చరితమును యథాశక్తిగఁ బద్యరూపమున వ్రాసి ప్రాజ్ఞుల యామోదమునకు దోయిలివట్టెదను.

ఇట్టి గ్రంథము శ్రీ లక్ష్మీనారాయణ గ్రంథమాలలో పంచమ కుసుమముగా గ్రుచ్చఁబడినది.

నన్నయభట్టు భీమకవి భిన్నకాలస్థులను వాదోపవాదములతో మునుఁగుచున్న ఈకాలములో నిఱువురు నేకకాలస్థులని ప్రబంధించితిని. చరిత్రకు సిద్ధాంతము, ప్రమాణము కఱవైనది. అందుచే విమర్శకు దిగక వీరిరువురకు సంబంధమును గూర్చు కథలనాధారముగాఁ జేసికొని, యీ పాత్రమల్లితిని. ఇటీవలఁ గొందఱీమార్గముననే వెల్లినవారును గలరు. రసికులిందు గుణములగైకొనకపోరు. ఇందు పువ్వుగుర్తుగల పద్యములు చరిత్రలోనుండి గైకొనఁబడినవి.

ఇట్లు

13 – 12 - 1950 రామభద్రశాస్త్రి

# అ భి ప్రా య ము లు

జటావల్లభుల పురుషోత్తము ఎం. ఏ., గారు
విజయవాడ 14 – 12 – 50

మీ "నన్నయభట్టు" నామక పద్యకావ్యము చేతి కందిన రెండుగంటలలోనే యామూలచూడము నవలోకించి యమందానంద మొందితిని. అందలి కథాసన్నివేశములు హృద్యములుగాను, భావములు సహృదయ హృదయాహ్లాద కరములుగాను, ధారాబుద్ధి పాఠక హృదయానర్షకముగాను నొప్పారుచున్నవి. కృతిపతి శ్రీ కనకరాజుగారు కవిపండిత పక్షపాతి ; దయార్ద్రహృదయుఁడు. తగిన వ్యక్తికి కృతి యిచ్చినందులకును మిమ్ముల నభినందించుచున్నాను.

విద్వాన్, మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి
రాజమండ్రి 15 – 12 – 50

బ్రహ్మశ్రీ చిలుకూరి రామభద్రశాస్త్రిగారు రచించి వెలువరించిన "నన్నయభట్టు" కావ్యము సాంతము పరికించితిని. పవిత్ర మధురమైన యితివృత్తము నేఱుకొని, ప్రాక్తనమైన కవిత్వపద్ధతిలో వీరీ కావ్యము వ్రాసిరి. వీరు ప్రసిద్ధ మహాకవులయిన శ్రీ చెళ్లపిళ్లవారి శిష్యులు. వారి శైలి వీరి కవిత్వములో నున్నది. ఈ కావ్యము పాఠకహృద్యమై, పాఠ్య గ్రంథమై వెలయునని వాంఛింతును.

శ్రీ దివాకర్ల వేంకటావధాని M. A.
విశాఖపట్టణము 10 – 12 – 50

తాము దయతోఁ బంపిన నన్నయభట్టను ప్రబంధము చేరినది. అచ్చటచ్చట చదివి చూచితిని. ఆంధ్రభాషా ప్రపంచమున కాదిమబ్రహ్మయు, నాంధ్రకవి సందోహమున కాచార్య వర్యుఁడైన వాగనుశాసనుని చరిత్రను సులభములును ధారా

శుద్ధిశోభితములునైన పద్యములలోఁ జదువుట నాకెంతయు సంతసము చేకూరినది. పరిశోధకులకుఁగూడ సరిగాఁ దెలియని నన్నయభట్టు చరిత్రము నొక క్రమమార్గమున గూర్చిపెట్టిన తమకృషి నెంతయుఁ బ్రశంసించుచున్నాను. తమశైలి మృదు మనోహరమైనది.

శ్రీ చెన్నలగడ్డ సత్యనారాయణమూర్తి M. A. గారు
విజయవాడ, 10 – 12 – 50

అవ్యాజానురాగముతోఁ దాము పంపిన నన్నయ భట్టును మిక్కిలి మక్కువతోఁ బరిశీలించి యానందించితిని. నైసర్గిక ప్రతిభా సమన్వితులైన శ్రీ తోలేటి కనకరాజుగారికీ గ్రంథ మంకిత మీయఁబడుట ముదావహము.

చరిత్రకును సాహిత్యమునకును గల సన్నిహితసఖ్యము గ్రంథముఁ గోచరించుచున్నది తూర్పు చాళుక్య భూపతులు సనాతన ధర్మసముద్ధరణమును గాంక్షించిరి. ఉదాత్త సాహిత్య సృష్టియందు నిజాశయ చరితార్థత నవలోకించిరి. సత్య సందీప్తమైన సాహిత్యమున సనాతన ధర్మప్రభావము పరిఢవిల్లునని గ్రహించిన రాజనరేంద్రుఁడు పంచమామ్నాయము నాంధ్రీకరింపుఁడని నన్నయభట్టును వేడెను వ్యాసనారాయణు నారాధించి గోదావరీ సరిత్తిలకము నాశ్రయించి దివిజ కల్లోలినీ ప్రాయమున కెనయైన కవితాస్రవంతిని సృజించిన మహాత్ముఁడు నన్నయభట్టు.

ఆంగ్లకవులలో స్పెన్సరును Poets poet. అనుచుందురు. తెలుఁగుకవులలో నన్నయభట్టుకూడ నిట్టి గౌరవార్హుఁడే ! ఈ కవీంద్రుని జీవితోదంతము ననల్పకౌశలముతోఁ దాము చిత్రించిరి. సందర్భశుద్ధి ననుసరించి శ్రీ వేములవాడ భీమకవి వృత్తాంతమును దెలిపిరి. ఆంధ్రశారద మనియున్నంత కాల మీకృతి శోభిలజాలును.

# సవరణ

| పు. వ. | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 5-11 | గావలెలుచుండిరి | నందుచునుం |
| 5-14 | బ్రావ | విప్రు |
| 6-14 | మిసవ | మిదియగు |
| 21-11 | మహాజ్ఞల్గాని | కృతాభ్యాసంబు |
| 24- 7 | రసికులుగాన | రసికులంట |
| -15 | పతికిచ్చినదెల్వియుదేట | పతిరీతిక హెచ్చినదెల్వి |
| 25- 8 | గురువుల | గురుల |
| 33- 1 | మహానందంబుతోన | మహాత్మా! భూపతీ! య |
| - 3 | లకున్ జ్ఞానంబు | విద్యన్నేను |
| 44-19 | తార్చన | తార్హాణ |
| 50- 1 | నున్నట్టిబాలు | నున్నమాణవకు |
| 62-18 | కగనొక్కుడు | కగుదా నొక్కుడు |
| 69- 7 | కల్ముడి | కలముడి |
| 75-12 | మహావిరా | భాగ్యరా |
| 76- 8 | నామాత్య | నాఖ్యాన |
| 93-21 | యోత్సాహంబుదీపింప | యుప్రోత్సాహ మేపార |
| 97- 2 | కానుపడగ | దనరుచుండ |
| 101-13 | స్వకర్మాధీనుడై | యు దుష్కర్మాప్తిచే గా |
| 106- 4 | మరణంబా | మృతియొన్నన్ |
| 108-15 | చినవింతటి దక్కునాకు | చెనునేటి దక్క |
| 112-18 | విద్వాంసపఖుఁ | విద్వత్సఖుం |
| 114- 6 | నట్లొప్పగాను | నట్లతిశయించి |

---

శ్రీమహాగణపతయేనమః

# నన్నయభట్టు

## ప్రథమాశ్వాసము

తే. గీ. శ్రీగణేశుని గొల్చెదఁ జిత్తమందు
గౌరినూనుని మధుర వాగ్ద్వారకరుని
శంభుతనయుని బావన శాంతికరుని
మామకీన హృదంతర మందిరేశు. 1

తే. గీ. వాణిరూపము ధరియించు రాణియెవతె!
సిరిగ నగుచుండు వనిత యీశ్వరియు నెవతె!
శివునిరాణిగ వర్ధిలు శివయు నెవతె!
అట్టిమాతల్లి శక్తి నే నాత్మఁ గొలుతు. 2

తే. గీ. ఈశ్వరకుటుంబ మెవ్వాని హృదయసీమ
స్మర్యమాణమొ! వానికి జయముకలుగు
దాన నేఁగోరి కొల్చుచున్నాను శివుని
అట్టి నన్నేల బ్రోవఁ డా యభవుఁడింక! 3

మ. చిలుకూర్యన్వయవారిరాశిశశి శోచిష్కేశతుల్యుండు శా
బ్దలసత్సూరియు శిష్య సస్యచయ విద్యాసీర సద్ధాత్ర, భూ
తలి నిష్ఠామహనీయమూర్తి గురుశాబ్దాధీశ లక్ష్మీశుఁ డన్
లలిపాండిత్యచణుండు మద్గురువు మద్భాగ్యతన్సదాగొల్చెదన్.

చ. వరదయశాస్త్రి కింద్రియయి భాసురసద్గుణ సూరమాంబయే
ధరణిని మాతగానయి ముదాస్పదుఁ జేయఁగ భ్రాతృసత్కృపన్
వరదమతల్లి శారద నివాసముగాను మదీయగేహ మం
దురుకృపనుండి కావఁగ సనూహ్యచరిత్రుఁడనై చరించెదన్. 5

చ. గణపతి వేగఁ బ్రోవఁగ సుఘాతము లబ్బునె! పాండితీ ధనో
ద్గములకు లోకమందున విధాతకృపాప్తులు వారు కారె? వా
క్ప్రభులకుఁ బార్వతీతనయుఁ గంబగు భక్తి యొనావ! దానిచే
గణపతిఁ గొల్చి విద్యలవికాసము చేఁ దరియించెదన్మహిన్. 6

# కృతిసమర్పణ

శ్లో. జయతు. తోలేటికనకరాజ! ప్రభూత!
జయతు. కేవల నిజకృషి జాతకీర్తి!
జయతు. దీర్ఘాయురారోగ్యసహిత విప్ర!
జయతు. సద్దేవతాకృపా సాధ్యభాగ్య!

తే. గణపతీ! నీవు తోలేటి కనకరాజు
వైద్యవర్యుని గావుమా! పరమకరుణ
నేలయున! రోగపీడితుల నితఁడు జేసి
యాయురారోగ్యసుఖముల నందుకతన. 8

ఉ. రాజమహేంద్రవర్యుని బురాన ప్రభుత్వపు వైద్యశాల, వి
భ్రాజిత వైద్యపారగుఁడు వైద్యుల కొజ్జయి శస్త్రవైద్యమం
దీజగమందుఁ బేర్గనిన నీతనిచేత విరాజిలెన్గదా!
నైజము బుద్ధిమంతుల మనస్సె ప్రధానము లోకతుష్టికిన్. 9

మ. ఒకసామాన్యపు వైద్యుఁడై రణములో నొప్పించి పేరంది వి
ద్యకు దేశాంతరమేఁగి నేర్చికొనిరా సస్మత్పురీ దుస్థితి
స్సకలంబు న్విశదంబుజేసి రుజదోషంబెల్ల వోగొట్ట నీ
యకలంకు న్బనిపెన్గదా! ప్రభుతయే ఆరోగ్యమేమందఁగా. 10

తే. యాజ్ఞవల్క్యనిగులమున నలరినట్టి
ప్రథమశాఖ నియోగుల వంశమందు
జననమందెను కనకరాట్పుత్త్రముండు
ఇతనిమూలాన గులమెల్ల హెచ్చెఁ గీర్తి. 11

సీ. తండ్రి! నరసరాజు తల్లియో! రామల
క్ష్మమ్మ యూ నుత్తమచరిత యామె
లలిపితామహుని సుబ్రాజని వచియింత్రు
మాతామహుని బేరు నీశుఁడందె
సత్యనారాయణ నరసుఁడే యన్నయూ
సూర్యనారాయణ సోదరుండు
కామకోటీశుని ఘననామమునుంచెఁ గొ
మరునకుఁ జంద్రశేఖరుఁ డటంచు

తే. ఆత్మజయు! సీతరామలక్ష్మమ్మ యయ్యె
సతియు! సద్గుణవల్లి శేషమ్మగారు
దానధర్మాల దీనులఁ దనుపునట్టి
యామె యోగ్యతఁ జెప్ప నా కలవియగునె? 12

సీ. పంక్తికిఁ బదిమంది బాపనయ్యలు లేక
భుజియింప నెఱుఁగని బ్రాహ్మఁడితఁడు -
బీదసాదలనెంచి పేరు పేరడుగుచు
బాధపోగొట్టు సద్బంధువితఁడు -
అడిగినవారల కప్పుడే వైద్యము
చేసి పంపెడి మహాచిత్తుఁడితఁడు
తనసుఖమున్వీడి జనబాధ లోనెంచి
బాపుచునుండెడి బాపఁడితఁడు -

తే. ఇట్టి నరసేవ కుత్సాహమిచ్చుచుండి
సంబరముతోడఁ బతిసేవ సలుపు గృహిణి
ఆమెదే యీయదృష్ట మటంచునెంతుఁ
గనకరాజన బంగారుఖడ్డి గాఁడె! 13

శా. మానుష్యంబును శ్రేష్ఠవంశమున జన్మంబాయువారోగ్య స
త్సూనుల్ మిత్రము మంచియాలియు మహాత్ముల్ విష్ణునింగొల్చుటల్
గానముల్ పాండితి యుత్తముండగుటయు న్గార్మిన్వితీర్ణత్వమీ
కనకాభిఖ్యునియందుఁ గల్గెను జగత్కళ్యాణపుణ్యాళిచే. 14

సీ. తారాధిపునిదృష్టి తగిలి ఛేదిల్లె మున్
విఘ్ననాథుని గుక్షి వేవిధాల
శివునానచేత నాశ్వినులు స్వయంబుగాఁ
గుట్టిరి పాములగూఁపుచేత
ననిచెప్ప వినియుంటి నది నమ్మకుండియు
కనకరాజను భిషఘ్నునివలన
నిజమనియెంచితి విజయుఁడే శస్త్రచి
కిత్సలో నతిశయోక్తియునులేదు -

తే. ఇతనిమదిలోఁ దలంచుచు నెందఱెంద
రో! రుజలను బాపుకొనంగ నరుఁగుదెంచి
సుఖముగా మఱలుచుండిరి చోద్యమంది
ఆశ్వినేయులె కనక రాజంచునెంతు - 15

తే. అన్నిరకముల శస్త్రవైద్యాలలోనఁ
జేరువడసిన వైద్యుఁడీ బావఁ డాంధ్ర
విశ్వవిద్యాలయంబున జేసుగన్న
అల సెనెటున మెంబరై యలరె నేఁడు. 16

తే. ఎకడమికౌన్సిలందున నెగడు నైన
సభ్యపదవినిబొందె నిస్సంశయముగ
ఇంకనుం బెద్ద పదవుల నిచటనుండి
యశము నాయుస్సులంబొంది యలరుఁగాత. 17

ముప్పదెనిమిదవ ప్రాయమున నితండు
యుద్ధవైద్యుఁడుగా వెళ్ళియుండె నారా!
తనకుటుంబము జీవిత తత్పరత్వ
ముల గణింపక నరసేవ ముఖ్యమనుచు. 18

దగ్గఱనూరులంచు మదిఁ దల్పగ శక్యము? దూరదేశమం
దగ్గలమైన దెల్విగలయాతఁడు మానవసేవ చేయుచున్
నెగ్గెను సర్వమానవుల నిల్పెను గీరితి శాంతచిత్తమం
దొగ్గ శిరస్సు నింతటివరోపకృతుల్ సలుపంగలేరొరుల్. 20

గీ. రండయ్యా! రణభూమికిచ్చెదము మీప్రాప్తానుసారార్థముల్
రండయ్యా! నరసేవచేసికొన మీప్రాయంబు ధన్యంబగుక్
రండయ్యా! వితతార్థము ల్బడసి యారా! పెద్దవార్గాఁ దలం
పండయ్యా! యని యా ప్రభుత్వము వచింప న్వోయి రే?
రొక్కరున్. 21

చం. బ్రతికిననాళ్లునాళ్ళు సుఖభాగ్యములందఁ దలంచువారు తా
సతిసుతుల న్విసర్జనము సల్పగ జంకెడువారు మృత్యువా
పతిత మటంచు భీతిలి కృపారసమొల్కఁగఁ బల్కువారునై
కృతులట! నాటివైద్యులు తెగించె నితం డతిధీరచిత్తుఁడై. 22

వ. ఈతఁ డుద్యోగము చేసిన హిందూదేశములోని పట్టణ
ములు : 23

సీ. అల పిషావరునందు నార! రావుల్పిండి
*మావో - పురంబులమలఁగియుండి
లాహోరు - కోమిల్ల - రాక్షసభూముల
ఢక్క - మీరటు - లందుఁ దగగనుండి
♦సహారనుపురములోఁ జలిబాధ సహియించి
కాకినాడకుఁ జేరెఁ గొతుకాన
మదరాసు - బెంగుళూ ర్మన్న నలందుచు
నల - విశాఖపురాన కంతఁజేరి

తే. అప్పటికి యుద్ధమంతయు నంతరింపఁ
గొంతకాలము చదువగాఁ గోర్కెపుట్టి
దానికై పట్టుపట్టి యాదారి నన్య
దేశములకేఁగెఁ బ్రభుతయే తీవ్రభక్తి
సాయపడ నీతఁ డప్పుడు సాహసాన. 24

మ. అలయింగ్లండుకు రాజధానిపురమా నాకానికే యక్కమై
వలుక న్భారతదేశవిత్తమున సౌభాగ్యంబులోనుండి బీ
దలమూలాన జమీనుదారులగు విత్తాత్ము ల్విరాజిల్ల లం
కలకున్ జేఁడగు లండనన్ పురములోఁ గాలూదె నీతం
డహో! 25

---

* Near Indore (సెంట్రల్ ఇండియాస్టేట్).

♦ హిమాలయప్రాంతం - హరిద్వారందగ్గర.

సీ. చెప్పినసంగతుల్ చిత్తములోఁ బెట్టి
మంచివైన గ్రహించు మాన్యు లచట!
అధికసంఖ్యకు విద్య యంటుటచే సంఘ
దోషవిదూరులు దొరలు నచట!
నల్లవారనినచో నమ్మికచే వీరి
పనుల మెచ్చెడి గొప్పవార లచట!
తెలివి కలుగువారు తెలుఁగువార లటంచుఁ
జదువుల నిచ్చు నిష్పక్షు లచట!

తే. అట్టిపురిలోని యధికుల యండఁ జేర
లోని నాల్గుగ నయి వారి లోఁగఁదీసె
నే వయస్సైన విద్యకై యింతఁబట్టు
దలయె చదువులు నిచ్చుగా ధరణి యుందు. 26

మ. అలస్కాంట్లందునఁ రాజధానిట! సుప్రీంఖ్యాతంబటౌరా! మహో
త్కలకాహానవ భూమి యుంట ధరనామోదానకే తల్లిని
వ్వలపించున్నబరియా! ఎసింబనుట! ఏకనాన్మన్యుఁ డిచ్చోటనే
చెలఁగన్విద్దెలనెల్ల నేరిచి, 'ఎఫార్సీయు' స్పనే పేరుతో; 27

తే. చెలఁగి వైద్యములోఁ బెద్ద చెయ్యి యనఁగఁ
గీర్తినిచ్చెడి బిరుదముఁ గెలఁబట్టి
పార్తికదుపావరేవను పూర్తిగాను
జేయనేర్చను దొరలు చేదోయి మ్రొక్క. 28

ఉ. అంతకుఁ దృప్తిపొందక తనంతటఁ జేరెను 'గ్లాస్కొ' యన్పురిన్
వింతగ, 'సర్జరీస్ట్రు' వివేకముతో సలువంగ నేర్చి య
త్యంతమునేర్పుగాంచి జనతానుతుల న్గొనియుండి యంతకున్
స్వాంతము తృప్తిపొందక విచారణఁ జేయుచు నీతఁడే భళీ! 29

మ. అల 'ఐర్లండు'కు రాజధానియయి,'డబ్లిన్'పేరుతో నొప్పుపూ
ర్వాలయోన్నత్యముచాటుశిల్పములనారూఢిన్విడంబించు నీ
విలస త్పత్తనమందునుండి మరియు న్వైర్గన్న 'నింగ్లండు' లో
పల నీప్రాంతపు వైద్యులందు నితఁడే భాసిల్లు 'సర్జ'న్గదా! 30

తే. లీడ్సు — న్యూకాసిలు — పర్టీల్డు — లివరు పూలు
భళిర! మెంచిష్టరీ, మొదల్పట్టణాల
వైద్యశాలాళి వైద్యుఁడై నరలి 'లండ
ను' నకుఁ జేరియుఁ బెద్దల మనములలర, 31

తే. పెద్దవిషయాలు గ్రహియించి పెద్దచోట్ల
పనినిజేసియు గరువపుఁ బలుకులేక
కనకరా జట మార్తాండ కాంతి గతిని
గలయఁ దిటిఁగెను పరదేశ ఘనులె; మెచ్చ, 32

కం. పనిచురుకు! మనను చురుకట!
వినగాఁజురుకంట! మాట విప్పుట చురుకౌ!
కనుటయుఁ జురుకట! భళిరా!
కనకాఖ్యుని వాగ్రసంబె గాంచన్జురుకౌ, 33

తే. కనకరాజట! కృతిపతి, కావ్యమన్న
నన్నయ చరిత్ర! స్థలము! రాణ్ణగరవరము!
కాలమా! యోగ్యమైనది కలయఁజూడ
నౌర! యన్నియు సమకూరె నమృతమస్తు. 34

సీ. స్వర్గమునకుఁబోవ సంసిద్ధుఁడౌ నన్ను
ధరణి నిల్పిన మహోదారుఁడితఁడు,
ఆవశేషనుజేసి యత్యంత మోదమును
గలుగఁజేసిన మహా ఘనుఁడితండు,
ప్రేమతో ననుఁజూచి క్షేమమా! యని పల్క-
రించుచు నుండెడు శ్రేష్ఠుఁడితఁడు,
మార్దవంబుగ హాస్యమాధురి మాటాడి
కౌతుక మొనరించు ఘనుఁడితండు,

తే. ఇతని ఋణమును దీర్చు టదెట్లొటంచు
మదిని యోజించి ఫలముల మన్ననలిడఁ
గోపనూచన చేసె నీ పాపహారి
ఇట్టియోగ్యుని సంతుష్టి నెటులఁ జేయఁ
గలనటం చెదఁ జింతించి కపట రహితుఁ, 35

తే. డిట్టి మహనీయునకు నొక్క కృతి సమర్ప
ణమును జేయఁగ మదినెంచి నన్నయార్య
జీవితము నంకితమునీయఁ జేఁగోలఁది
పద్యకావ్యముగా వ్రాసి పరఁగినాఁడ, 36

మ. కృతికన్యామణి నీ మహామహునకుం గేలొగ్గి యీనుంటి, నీ
పతిగా సాయము నొసంగి బ్రోవు మతఁడత్యంతాద్భుతంబందఁగా
మతిలో యోజన సేయుఁడో చిటులిమూర్త్యస్మృతీంద్రాఢ్యుఁడే
స్థితిరంబా యశమందనుంటిఁ గరుణాచిత్తేశ! విఘ్నేశ్వరా! 37

ఉ. ఉత్తమవంశజాతునకు నుత్తమ కీర్తి పరీతవిద్యుకున్
సత్తమరూపధేయునకు సద్రసపూర్ణ మహిత్రవాక్యుకున్
చిత్తసమాతి తీవ్ర కృతిజేతకుఁ బండిత పక్షపాతికిన్
మత్తజనాంధ్య హారికి సుమాపతిభక్త సువర్ణరాజుకున్, 38

శా. శేషాంబాధవుకు న్మహీవినుత సచ్ఛీలాది విఖ్యాతుకున్
భాషాజ్ఞానికి సంస్కృతాంధ్ర యుగళీ పాండిత్య సంశోభికిన్
వేషాడంబర హీనుకున్ సరసతాప్రీతాభిసంభాషికున్
పాషాణాదినమస్త వైద్యవిదుకున్ ప్రాజ్ఞాత్మునన్యోగ్యుకున్,

శా. ఆత్రోలేటి కులాబ్ధిచంద్రునకు సన్మార్గయోగారు ధీరాత్మకున్
సీతాశేష జనార్తి సన్నిధికిని న్నిత్యోత్సవానందుకున్
భూతాధార శివార్చనాపరునకున్ బూజ్యప్రపూజ్యాత్మకున్
యాతాయాత వితీర్ణశాలికిని గన్యాదాతనై యొప్పెదన్. 40

వ. ఇట్టి మహనీయున కంకితం బిడుసట్టి నన్నయభట్టారక
చరితమునకుఁ గథాక్రమం బెట్టిదన -

ఉ. మాతవలెన్ స్వసూనుల ప్రమాదముల న్గడఁ దేర్చుచు న్మహా
పాతకహారి వారిచయ పావితభూతల జంతులోక సత్
భూతి సుఖప్రదాయి ఘనబుద్ధివిధాయియు స్వర్గదాయియౌ
గౌతమి సత్తపస్క మునికాండము దేవులఁ జేయుచున్దగున్.

తే. నిస్సవత్నప్రవాహమై నెఱయఁగాన
భళిర! గోదావరీభూతి పలుకవశమె?
దేవతావళి ముదముతోఁ దేజరిల్లి
యీమెఁగొల్చుచు నిల్చుట యిందుసాక్షి. 43

సీ. భవమ! నాసికయందు భద్రాద్రిరాముఁడా!
పార్శ్వమందున, మధ్యభాగమంద!
పట్టిసేశుఁడు, వీరభద్రుని దూర్పున!
కోటిలింగేశుని గోర యామ్య
కందు సుతేశుని ఘనజనార్దనుఁ దాల్చి
రామపాదక్షేత్రరాజిఁ జెలఁగి
పడమరదిశను! గోష్పదమనుక్షేత్రమున్
సప్తరీతులఁ జీలి సాగియుండి,

తే. అపర గంగావతారమ స్యశముసంది
భక్తులకు ముక్తిదాత్రియై పరఁగుచుండి
స్మరణమాత్రాన శుభదమై మాదుభూమిఁ
దిరుఁగు గోదావరీభూతి నరయఁగలమె? 44

సీ. ఏతల్లి! పాపంబు లింకింపఁ జేయుచుఁ
బ్రోచునో! ప్రజలను బూన్కి శక్తి
ఏతల్లి! సుఖములనిచ్చుచు నిర్వాణ
మున గాఁచునో! ప్రాణులను ముదాన
ఏతల్లి! రుద్రపాదాంతస్థయై యొప్పి
నిలిచియుండెనొ! మహానిష్ఠతోడ
ఏతల్లి! భీమేశు పూజ్య పాదాబ్జముల్
భజియించుచుండెనో! భక్తిమీఱ

తే. అట్టి గోదావరికిఁ బార్శ్వమందున సుజన
సంపదల్ పొలుపార నసామ్యసుహిత
నాగరికతాభివృద్ధిచే నగ్రిమగుచు
రాణ్మహేంద్రపురంబు విరాజిలెనట. 45

సీ. ధరణీసురానంద దాత్రిగోదావరీ
పావనపవన సంవాసితంబు
సకలకళాగమ సాహిత్యనిలయ స
త్పాత్రపాదకాంతి విభాసితంబు
సాహసోద్భట శూరజాత కీర్తిసమూహ
ధనధాన్యసజ్జల స్థానకంబు
ఆనందదాయక దాన ధర్మ క్రియా
లగ్నచిత్తవదాన్య లాలితంబు,

తే. నియమనిష్ఠాగరిష్ఠ మనీషివృతము
నీతిశస్త్రాస్త్రపార్థివ నియతియుతము
సర్వమహానీంద్ర సత్త్రవస్సంయుతంబు
నీర్థ్యవాసము రాజమహేంద్రపురము. 46

సీ. ఆంధ్రభారతికి దే అత్తవారిల్లౌట
బిల్లజెల్లలఁగాంచెఁ జేర్మితోడ
సంస్కృతకర్ణాట జాతీయభాష లీ
పురిఁ గాపురంబుండెఁ బూన్కితోడ
పదిపదేనుతరాలఁబట్టి యాంధ్రపుఁ దీఁగె
లలుముకొన్నవి మహాత్మ్యంబుతోడ
ముద్దుముచ్చటఁ దీర మునితుల్యకవులు చీ
రెల సారెలిచ్చిరి కలముతోడ

తే. అక్షరముల్తైన సరిగ రానట్టి వయసు
నందు భారతపఠనము నందనేర్చి
క్రమముగాఁ గీర్తి దేశాలఁ గలయఁ జాటు
నీపురింగూర్చి వర్ణింప నిలనుగలరె! 47

తే. శాలివాహనశకమున సలలితమగు
దేశములకెల్ల జేఁడుగాఁ దేజరిల్లు
నల మహారాష్ట్రదేశమునందు బీజ
పూరు సంస్థాన కళ్యాణిపురి జగాన. 48

వ. ఇదియే రాజధాని. 49

ఉ. దానికిఁ బాలకుండయి నిదానము నేర్పు సుశిక్షణంబుగా, వాఁ
డై నియమంబు ధైర్యము ననంతబలంబును గల్గువాఁడు స
మ్మానితనీతిమంతుఁ డవమానమెఱుంగని పూజనీయుఁడై
పూనికతోఁ దలంపులను బూర్తిఁ జేయు ననుష్ఠుఁ డెన్నఁగా.

కం. సత్యప్రియుఁడై వర్ధిలు
సత్యాశ్రయనామధేయజనపతి భళిరా!
అత్యాచారభుజంగము
కత్యంతము గారుడంబు నయ్యె న్జగతిన్. 51

తే. కుబ్జవిష్ణువర్ధనుఁడను గొప్పవాఁడు
సీతసకిసోదరుండయి యెసఁగ మెసఁగ
నొప్పుచుండెను లవకుశు లొప్పునట్లు
పౌరుషానకు నొజ్జలై పరఁగినారు. 52

తే. భళిర! చాళుక్యవంశాన బరధపిల్లి
అల మహారాష్ట్రపాలన నతిశయించి
వచ్చి రణమున సేన నుర్వార జయించి
వేఁగిదేశంబు పాలింప వేగిరముగ
మొదలుపెట్టిరి విజయమే ముందునడువ. 53

తే. విష్ణువర్ధను సంతతి విరియుచుండ
వారిలో రాజరాజేంద్రుఁ డౌర! పుట్టె

నన్నయకుఁ బూర్వవంశీయు లెన్నఁబడుట
వీరికిఁ బురోహితత్వమే కారణముగ. 54

తే. వీరుకూడను రాజుతో వేఁగిదేశ
మునకుఁ జేరిరి గావున బూజ్యులైన
అల మహారాష్ట్రులందు నన్నయ్యభట్టు
బ్రాహ్మణుండయి జన్మించెఁ బ్రస్తుతింప. 55

తే. ఆ మహారాష్ట్ర విప్రుల యందు నొక్క-
తెగకు భట్టను నామ ముద్దీప్తమగును
పాఱుఁడై యున్న నన్నయపగముఁ డట్టి
తెగకుఁ జెందినవాఁడయ్యె జగమునందు. 56

తే ఈ చళుక్యులు సత్కవికృతులఁ గొనుచు
నాంధ్రభాషాభిమానమ నాచరింప
గ్రంథరచనలఁ జేయింపఁ గడఁగినారు
వీరిమించినరాజు లుర్విసీమ లేరు. 57

తే. రాజకీయపుభాసగా రాజిలంగ
నాంధ్రినిర్మింప నుత్సాహమంది వీరు
దీని యభివృద్ధియే సోనుపానముంచు
యతనముల జేయరే యెవ్వరైన గాని. 58

వ. విమలాదిత్యున కిద్దఱు దేవేరులు. అందులో జ్యేష్ఠు
రాలు పట్టమహిషి కుందవాదేవి. ఈమె చోళచక్రవర్తి రాజ

రాజు కూతురు. ఈమెకు రాజరాజనరేంద్రుఁ డుదయించెను. మాలవదేవి రెండవభార్య. ఆమెకు విజయాదిత్యుఁడు కలిగెను. అతనివంశములోని, 59

మ. విమలాదిత్యవిభూత్తమాత్మజుఁడు సద్విజ్ఞానవిశ్వాసి రా
ట్కమలాకారణధీరవర్య తనుజగ్రామంబుఁ గైకొన్న వాఁ
డమిశంబైన కృపాకటాక్ష మహనీయాకారయుక్తాత్ముఁడై
విమలాహంకృతి ఖడ్గరూపుఁడు మహావీరుండు రారాజుగా.

వ. ఈతని కమ్మంగదేవి పట్టమహిషి. ఈమెనందానమే రాజేంద్రదేవుఁడు. రెండవభార్య రేవలదేవి. ఈమె కళింగరాజ తనూజ. సోమలదేవి యీమెయేకైకపుత్రిక. ఇంక రాజరాజు. 61

చం. అనయము ధర్మకార్యవిజయాదులకై యతనించుచుండి నె
మ్మని గురువృద్ధదేవపదమే సురభక్తిఁ దపింపఁజేసి స
జ్జననుత దాత్మతాగరిమ స్వాంతముచేయుఁదలంచి వేఁగి పృ
థ్విని ననురక్తిఁ గొల్చు నతిధీరనృపాలకుఁడేడీ? నేఁడిటుల. 62

సీ. దేవభూదేవులు తీర్థముగానెంత్రు
భీష్ముఁడందురు రిపు భీములితని
విజ్ఞులెల్లరు వీనివేదాంతియందురు
అర్థులెల్లరు కర్ణుఁడందు రితని
మర్యాదభరితుఁగా మాన్యులెంతురు వీని
గృహివర్యుఁడందురు గేస్తులితని
సారసాక్షులు పంచసాయకుఁ డందురు
మాణిక్యమంద్రు సన్మార్గులితని

తే. సత్యపాలకులా! హరిశ్చంద్రుఁ డంద్రు
దాతలా! శిబితుల్యుఁగాఁ దలఁచుచుంద్రు
గురుజనుల్ వీని గురునకే గురువటంద్రు
కవియు నీతని గానముల వ్రాయఁగలఁడె! 63

కం. కవియును బేరును వినఁగనె
వివశుఁడయి యిచ్చునిచ్చు వేడుక నిచ్చున్
భవదోష నాశనంబులఁ
గవులే గావింపఁ గలుగుగానని యిచ్చున్. 64

ఉ. ఈపురిఁ బాయకుండెడి సుశిక్షితశాస్త్రుల యందు మేటు లు
ద్దీపితశక్తులై వసుమతీశ పురోహితు లార్యపూజితుల్
స్థాపితభక్తి ధర్మజయశాంతి వికాసిత చిత్తులున్ సుభా
గ్యోపగతాతి భావనలు యుక్తియుతాత్ములుగల్గి రాపురిన్. 65

వ. వారిలో 66

కం. నందవరీక ద్విజకుల
నందన వనమందుఁ బుట్టి, నన్నయ్యాఖ్యుం
డందముగఁ బారిజాతము
చందంబుగఁ దేజరిల్లె సజ్జనులెన్నన్. 67

ఉ. ఈనుమాహాత్మ్యమేదో! వచియింపఁగలేము, మహాత్మజన్మమే
భాసురకాలమైన విభవాతిశయంబున భాసిఁగాంచు వా

గ్దానులుపుట్టి లోకపువికాసము గూర్తురు గాన నన్నయా
వాసితహైందవం బతి విభాసురమై ధరనిల్చుఁ గావుతన్ 68

తే. గుంద్రని ముఖంబు వాఁడయి గొప్పలక్ష
ణముల నొప్పారు బాలుఁడు నన్నయాఖ్యుఁ
డెన్న నర మాత్రుఁ డనుచు నూహించలేము
వ్యాసు నపరావతార మన్వాసిఁ గాంచె. 69

మ. పదియాఱేఁడులు వచ్చునప్పటికి నబ్బాలుండు విద్యార్థియై
గద! సూరీంద్రులఁ జేరి విద్దెలను భక్త్యాత్ముఁడై పొంది మో
క్షదమౌ జ్ఞానము నంది నొజ్జలసముత్కంఠంబుతోఁ గొల్చి వా
రిది యౌ నానతి నంది విద్దెలను నేర్చె న్నేర్చి వల్లించుచున్. 70

సీ. ఉదయాన గురువుల యొద్ద విద్దలనేర్చు
నిష్ఠాగరిష్ఠుఁ డై నెఱయుచుండి
మధ్యాహ్నమందు సుమతులగు ఛాత్రుల
కును బోధనలనల్పఁ గోరి యుండి
రాత్రి భాగములందు ఛాత్రులతోఁ గూడి
ధర్మసూక్ష్మావళి దలఁచుచుండు
సర్వకాలము లందుఁ జదివినవిద్యల
నాచరణంబుతో నరయుచుండు

తే. శాస్త్రముల నాఱేఁటిని నేర్చి శాస్త్రియయ్యెఁ
దనర వేదాల నెఱిఁగి వధానియయ్యె,

బ్రహ్మహీనుల నోడించి భట్టునయ్యె
ధరణి నన్నయ్య బోలు విద్యార్థియేడి! 71

వ. నాటి దేశపరిస్థితులు. 72

తే. ప్రాకృతంబును గర్ణాట భాషచేరఁ
దెలుఁగు బాసకు సినసైన విలువలేదు
దానసే యన్య భాషాపదాలు వచ్చి
తనరఁ గలిసెను దెలుఁగులోఁ దద్భవాఖ్య. 73

తే. నాటి కున్నట్టి వ్యాకరణములవలన
నాంధ్రి శుద్ధమసైు ధర నలరలేదు
కానఁ బదశుద్ధి యంతఁగాఁ గానబడక
దుష్టశావ్యాళి తోలఁగక తొంగిచూచు. 74

తే. నన్నెచోడుని కృతమని వన్నెఁగన్న
అల కుమారసంభవమను లలితకృతిని
గాంచి దోసఁగులనేరిరి కవులు భళిర!
శాస్త్ర సంబద్ధమైు కృతిసాఁగెననక. 75

ఉ. అప్పటికుండెఁబొత్తముల హా! భళి! యంచు నుఖంపఁజేయఁగా
నిప్పటికవ్వి యన్నియు ననేకవిధంబు లదృశ్యముల్ గదా!
తప్పక నన్నెచోడకవితామణిసైున గుమారసంభవం
బిప్పటికి న్లభించె మన హెచ్చిన బుణ్యవశాన నిద్ధరన్. 76

ఉ. జైనమతంబు బౌద్ధమతసారము ప్రస్తుతము న్సుఖంబుగా
గానబడంగ నందఱు జగానఁ దదీయమతస్థులై రిఁకే
కోనను నీతియుక్తులు నిగూఢలసత్కృతులైనవారు తా
మానసమా మహేశ్వరసమర్పణఁ జేసినవారు లేరుగా. 77

తే. ఇట్టిప్రజలను సన్మార్గవృతులఁ జేయ
రాజుకైనను సుకవితా రాజుకైన
శక్యమగునంచు నెంచగాఁ జాలమకట!
రాజరాజేంద్రుఁ డెంతటి రాజైన. 78

శా. వామాచారులు మూఢకృత్యములతో వర్ధిల్ల నేరాజు కా
నీ! మాయాకృతి నాశవేదములుకానీ! జ్ఞానసద్బోధకం
బౌ మంత్రావళిగాని! సద్గురుమహాజ్ఞల్ గాని దేవాదివాక్
స్తోమంబుల్, ప్రియవాక్యసంచయములున్ సూక్ష్మంబులా?
త్రిప్పగఁ. 79

సీ. పెద్దల శుశ్రూష ప్రేముడి నొనరింప
లభియించు విద్య లుల్లాసమొసఁగ
గురుభక్తితోఁగూడి కోరినవారికి
లభియించు విద్య లుల్లాసమొసఁగ
వాగ్దేవినిం గొల్చి బ్రతికెడు వారికి
లభియించు విద్య లుల్లాసమొసఁగ
వినయవిధేయతల్ వెలుఁగొందు వారికి
లభియించు విద్య లుల్లాసమొసఁగ

తే. ప్రాక్తనంబగు సంస్కారభాగ్యముండి
బుద్ధిబలముండి శ్రద్ధయుఁ బోలనుండి
యాధికారితకలుగు విద్యార్థి నెలమిఁ
దల్లియుంబలెఁ బెంచు వాగ్వల్లి ముదము. 80

వ. అట్లు విద్యాభ్యాసకాలమున నన్నయకు. 81

కం. నారాయణ తుల్యుం డిల
నారాయణభట్టునాఁగ నళినాసనజుం
డౌరా! వినయోపేతుఁడు
ధీనుండగు నన్నయకు నధీనుండయ్యెన్. 82

కం. నన్నయ నారాయణులట
మిన్నగ విద్యార్థులగుచు మేనురశక్తిన్
క్రన్ననఁ జదువుచునుండిరి
తిన్నఁగ వాగ్దేవిఁ గొలువ దీనతలుడుగున్. 83

తే. రామలక్ష్మణులో! లేక రామకృష్ణు
లో! కుశలవులో! హరిపార్థులో! యటంచుఁ
దలఁపునకుఁ దెచ్చుచుండిరా తనయులౌర!
పూర్వపక్షీయ సిద్ధాంతములకుఁ గాదె! 84

సీ. వేదత్రయంబును వినువకశ్రద్ధతోఁ
బఠియించుచుండె నా బాలయుగము
వ్యాకృతిశిక్షల జ్యోతిషచ్ఛందముల్
లలినిరుక్తము కల్పములను న్యాయ

ముభయ మీమాంసలు నొవ్వ పురాణముల్
పరగెను విద్దెల భక్తితోడ
వైద్యశాస్త్రంబును బరమనైపుణితోడ
నేర్చుచున్నారు నేర్పుగోలది

తే. అట్టిసఖులకు నెడబాటు నంటఁబోదు
భారతియు నట్టివారినే బాదుకొనును
బాల్యమున గష్టపడినచోఁ బ్రాయమందు
సుఖముఁగూర్పవె? విద్దెలు శుభములిడుచు. 85

శా. లోకజ్ఞానముఁ బొందిలీఘునతి నాలోచించు నన్నయ్య వి
ద్యాకాండంబులమాత్ర మాతని సహాధ్యాయుండు నారా
యణుం
డేకీభూతమనస్కులైనను దనూవృత్తంబె వేర్వేరు త
ద్భీకారాత్మక భారతీనతిమె! యాసిద్ధుల్ గదా! చూడఁగన్.

తే. ఈయిరువురును రాజమహేంద్రవరము
నందు వసియించి సర్వదా బంధుగులను
దల్లిదండ్రులఁ దుష్టిని దనుపుచుండ
జరిగినవి వీరిపెండ్లిండ్లు సంబరాన. 87

వ. నన్నయ భార్యపేరు అరుంధతి. సోమిదేవి నారా
యణభట్టు సతి. 88

సీ. ధనములేనిదె కవిత్వంబు రుచించునా?
అనుచు లేచెడి కవివనిత యొకతె!
నీవు దేశంబుల బోవగా నొక్కతె
నుందునా? యను కవియువిద యొకతె!
సామానుపెట్టగాఁ జాలదు మనయిల్లు
పాత్రములెల్లను బోటి యొకతె!
కవులు రసికులుగాన గంజాక్షులకు లోటు?
పలుకరేమని దెప్పు భామ యొకతె!

తే. కవి సతీమణు లీరీతి గరువమంది
మగల నాదరించుచుండ నా మగలు కవిత
వ్రాసి కీర్తిఁగాంచుట నివాత దేశ
మందుసుఖయింప నేర్చుట యగును గాదె! 89

చ. కవులకుఁ జాలు భార్యలిలఁ గల్గరు చూడఁగఁ బండితాళికిన్
వివశత కల్గఁజేయు సతి విశ్వమునందు లభించఁబోదు వీ
రి వనిత లట్లుగాక పతికిచ్చిన దెల్లయుఁ దేటతోడఁ దా
ము విపులనుండి జీవికము మోదముతో దొరలించుచుందురే.

చ. ఇరువురు సత్కవీశులు మనీషివరేణ్యులు శేముషీధురం
ధరులు వినీతవిద్యులు కృతజ్ఞులు కృత్యవిదాత్ములౌచు సం
బరమున గార్హపత్య సుఖబంధము లందుచు జీవితంబు నా
తరుణులనందుచునడుపు దాంతులుగా నయిరయ్య! సత్కవుల్.

ఉ. పున్నముచేతనే యశముపొందుచునుండిరి గొందఱీభువిన్
వన్నెయుఁగల్గి లౌకికప్రవర్తనముల్ తెలియంగలేక వి
ద్యోన్నతులైన పుత్రసుఖసారము నందఁగలేక దుఃఖముల్
క్రన్ననఁబొంది జీవితసారము నందగలేరు కొందఱున్. 92

వ. ఇట్టి రాజరాజు:

సీ. అస్త్రశస్త్రాదుల నభ్యసించుచునుండి
వీరవరేణ్యుఁడ న్పేరునంది
భయభక్తులంబొంది పరమగురువులయొద్ద
నీతిశాస్త్రాదుల నేర్చియుండి
రాజకార్యములందు భ్రాజితస్వాంతంబు
కడఁకమై చరియింపఁ గలుగుచుండి
పితృాజ్ఞయనినచో వేదవాక్యముగఁ దా
నెంచుచుఁ జేయఁగా నెంచుచుండి

తే. పెద్దలనుజేరి ప్రియముగా ముద్దులొలుకఁ
బలికి సేవించి వినయమొప్పంగ నిలిచి
వారియానల బాలించి వఱలువాఁడు
రాజరాజయ్యె యువరాజు నైజముగను. 94

సీ. తండ్రినిమించిన దాతృత కలిగియు
గుప్తదానము చేయఁ గోరుచుండు
విద్వాంసుఁడైనను బ్రియముగా మితముగాఁ
జాతురితోఁ బల్క సాగుచుండు

రాజకీయములందు రాజరా జితఁడని
ప్రజలు మెచ్చుకొనంగఁ బఱఁగుచుండు
బౌద్ధ జైన మతాల బడఁగొట్టి యద్వైత
మతమును నిలపెట్ట నతతముండు

తే. ప్రజలఁ దాఁ గన్నప్రజలుగ స్వాంతమందు
నెంచి వారలసౌఖ్యము లెంచుచుండి
యటుల వర్తింపనేర్చిన అవనిపతిగ
సుతునిగన్నట్టి తండ్రికి సుఖముగాదె! 95

తే. ఇట్టివానికి యువరాజ్య పట్టమిచ్చి
తల్లిదండ్రులు ప్రజలు సంతసముమీఱ
నుంట యబ్బురమానె! తా నింటనున్న
బైటనున్నను మణి కాంతిఁ బారనిడదె? 96

వ. కాలక్రమమున విమలాదిత్యుఁడు స్వర్గస్థుఁడుకాఁగా మహాజనానుమతముగా రాజరాజు పట్టాభిషిక్తుఁ డయ్యెను. ఈతఁడు సకలకళాపోషకుఁడు - రసికుఁడు - ఈతనిసంస్థానమున బలువురు కవులు కలరు - వారిలో ముఖ్యుఁడు నన్నయభట్టు. ఈభూపతి కర్ణాట ప్రాకృతగీర్వాణాంధ్ర భాషలకు సమపోషకుఁ డయ్యు నీతని యాశయములుమాత్రము రెండె! ఆంధ్రభాషాభివృద్ధి - హిందూమతోద్ధరణము. ఈ యాశయసిద్ధికై రేబవళ్ళు జతనించుటయే యీతని దినచర్య. 97

తే. నాటి సామాన్యజనతను నడువుటకయి
భావఁ డాలోచనను జేయఁ బార్థివుండు
శక్తిఁ జేఁబూని సంఘవిపత్తులను ల
యింపఁజేయుట పరిపాటి యింపుగాదె! 98

తే. ప్రాణసమముగ నెంచును భారతంబు
నంత కధికంబుగా నెంచు నాత్మనిష్ఠ
దాని కెచ్చుగఁదలఁచును ధర్మబోధ
నన్నయదినంబు లీరీతి నడువుచుండె. 99

ఉ. ఇట్టి నృపాభిలాష కడు హెచ్చుగ నన్నయ వానిమిత్రమున్
పట్టునుబట్టి నాటి జనభావగతంబగు నాస్తికత్వముం
నెట్టగ భారతాది పరినిష్ఠిత ధర్మవిశేష బోధలన్
బట్టగఁజెప్పుచుండు రిది పార్థివు చిత్తముకుంబ్రియంబుగా. 100

తే. *ఉదయమున ద్యూతసంగతి నొప్పుచుండు
స్త్రీప్రసంగాన మధ్యాహ్న శేషమందు
రేయిఁ జోర ప్రసంగాన వృథయగాక
బుద్ధిమంతుల కాలంబు పోవుచుండు. 101

తే. చదువు నొక్కఁడు సకల సుజనత మెచ్చ
అర్థ మింకొక్కఁడుం జెప్పు నహరహంబు
అట్టితఱిఁ గూడ రే జను లాదరాన
నేటి నాగరికత వృద్ధి నాటి కేది? 102

* భారత. రామాయణ. భాగతములు.

సీ. రాగధోరణిలోన రసము జీర్ణింపగా
రసములోపల చేష్ట మసలుచుండ
చేష్టలు భావమున్ జెప్పుచునుండగా
భావము మధురోక్తిఁ బడయుచుండ
మధురోక్తిలో లోకమర్యాద లిముడగా
మర్యాద లోకోక్తి మనువుచుండ
లోకోక్తిలో సూక్తి సోకుచునుండగా
సూక్తిలో మతమును జూపుచుండి,

తే. మతములన్నియు మంచివే! మహిని నేఁడు
సర్వమత సంఘమందు నంస్తవ్య హైంద
వ మతభావముఁ బద్యార్థవర్తిఁ జేయ
వరలు వారిపురాణ మీ వరుసఁగాను. 104

మ. మును జైనంబును బౌద్ధధర్మముల నామోదించులోకాళి యీ
వినుతంబైన మహాత్మ పాండవకథాప్రీతాత్మమై ధర్మముల్
వినుటం జేసియు వారిదుర్మతముల న్వీడి హిందూమతం
బునకుం జేరెనుమూఁడువంతులుగదా! పూర్ణంపుసద్భక్తితో.

తే. ఇదె గతానుగతికమని యెంచుచుంద్రు
నాడు నేడును హైందవనాళములను
బ్రాకియున్నది యీజబ్బు ప్రాకుచుండెఁ
బ్రాకఁగలదయ్యె! దీనికి వైద్యుఁడేడి? 105

తే. నేటి కమ్యూనిజాదులు నిలిచియుంట
కిదియె కారణమని యెంచు టేమిదోసఁగు?
జ్ఞానవంతులకన్న నజ్ఞానయుతులు
హెచ్చు దేశానగలిగెడి నెగ్గునిదియె. 106

తే. నేడు గాంధీమహాత్ముఁడు నాడుచూడ
రాజరాజ నరేంద్రుఁ డౌరా! యనంగ
నేడు నెహ్రూను బోలినవాఁడు నాఁడు
నన్నయాఖ్యుండు నూరిమై వన్నెఁగనుట. 107

తే. ఇట్టికక్షలు నశియించు టెట్టులనఁగ
ప్రజల న్యాయపుదృష్టితోఁ బ్రజలగాను
బాలననొనర్ప నమకూరుఁ బ్రభువుననుచుఁ
బక్షపాతము చూపుటే పగఁబెన్వృద్ధి. 108

సీ. శాంతిచక్రము దాల్చి దాంతితో నలరెడి
శంకరాచార్యుండు శాస్త్రయయ్యె
శాంతిచక్రముఁ దాల్చి దాంతితో నలరెడి
రామచంద్రుఁడు మహారాజ నయ్యె
శాంతి చక్రముఁదాల్చి దాంతితోనొప్పారు
బుద్ధుఁడు జనులకు బోద్ధయయ్యె
శాంతిచక్రముఁ దాల్చి దాంతితోనుండెడి
యమధర్మరాజు నియంతయయ్యె

తే. శాంతిచక్రము చేతనే శ్రమనుబొంది
మనకు స్వాతంత్ర్యమిచ్చిన మహితయశుఁడు
గాంధికన్నను సాక్ష్యము గలఁడె! నేడు
శాంతియేగద! జగతిలోఁ జక్రవర్తి. 109

కం. నన్నయ నారాయణులను
మిన్నగఁ దానెన్ని రాజు మించిన వేడ్కన్
సన్నుత విద్వద్బృందపు
మన్ననఁ గావించుచెపుడు మాన్యులఁజేయున్:  110

వ. ఒకదినమున నిండుపేరోలగంబున, రాజు —

మ. కవులారా! తమబుద్ధిసద్బలము సోకంజూచి మద్రాజ్య సం
భవ కష్టంబుల నెండఁజేయుట, భవద్భవ్యంబు కర్జంబు. మీ
కు వశుండన్గద! యానలిండనఁగమాకు న్శక్తి యేపాటి దీ
భువి, వేదాదుల నేర్చుఛాందసులమన్యాభవుండు తానవ్వుచున్.

సీ. రాజ్యతంత్రములన్ని ప్రాజ్యవేదములందు
నిమిడియున్నవని యూహించలేమ?
ధర్మశాస్త్రంబుల మర్మాలు వేదాల
నిమిడి యున్నవని యూహించలేమ?
సాంఘికధర్మముల్ సహజవేదము లందు
నిమిడియున్నవని యూహించలేమ?

మంత్ర యంత్రమ్ములు మాన్య వేదములందు
నిమిడి యున్నవని యూహించలేమ?

తే. శాస్త్రజాలము భువిలోన ఛాందసంబు
సకలసృష్టిరహస్యంబు ఛాందసంబు
ఇట్టి ఛాందసపంక్తిలో, గట్టివాని
బండితుండని పిలుచుట భవ్యమగును. 113

తే. ఇట్టిపాండితి లేనిదే యెంతవాఁడు
సుకవి కానేరఁడయ్యు! యోసూరివర్య
దోర్లుచుండును గవి మనోడోలికలను
వేదశాస్త్రీయ ధర్మము ల్వివిధగతుల. 114

తే. జనుల రక్షించుటను కార్యజాలమంత
ధాతయిడినాఁడు రాజుపై ధరణిసురుల
పైన గావున మాకుసాపడుట తమకు
నర్హవృత్తిగ నెంచరా? యాత్మలందు. 115

తే. ఇదె! సనాతనపద్ధతి యిదియెనాడు
నేడుకూడను లోకాన వాడుక గద!
ఇందు కేదియొ, యడ్డము నిముడఁ జేసి
సంచరింపంగఁ జెల్లునే? స్వచ్ఛచరిత! 116

మ. అనఁగా నన్నయ యిట్లువల్కెను,మహాత్మా! నీవు రారాజువే
నన నీపాలన లోనివాఁడను, విధేయాత్ముండ, మావల్ల నే

వనినిన్గోరెదొ! వల్కుమయ్య! యనఁగాఁ బ్రార్థించెదన్నిమ్మునే
సనఘా! సత్కవి! శాంకరంబగు మతంబా! ధాత్రినిల్పంగదే!

చ. మతమునశింప మానవులు మానుషులుగారె? జగాన సత్కవీ!
మతమె సమస్తకార్యపరమార్థము చూపుచు సమ్మతంబగున్
మతమెయొసంగు మోక్షమును; మానవుఁ దుష్క్రియు తాత్మఁ
జేయు నా
మతమును వీడుటన్న భువి మానవతన్ విడనాడుటే నుడీ!

తే. అట్టి మతరక్షణంబుకై యహరహంబు
రాజనాటను నేను వాగ్రాజులగుట
మీరు నడుము బిగించక మేదిని నెటు
ధర్మబోధిగ నానాఁగో! ధార్మికవర! 119

శా. మారాజ్యంబు వివృద్ధిఁజేయుటకునై మాకీర్తి నిర్మింప మా
వైరీంద్రుల్ నశియింప యోజనకునై నై దేశసంవిత్తుకై
మా రాజ్యాంతరసంస్థదుర్మతములన్ నాఁడ్చన్నిరింజూచి యీ
మీరే నిల్పి మహాజ్ఞ లిం డిదియె నే మీపాదభక్తుండఁగా.

ఉ. నేడు మొదల్ మదీయమగు నీతియుతంబగు రాజ్యభూమి వా
దాడగ రాజరాజకవియ న్యశమీయఁగ మిమ్ముఁగోరెదన్
మాడలుమాన్యముల్మిగులమావలనంగొనిసౌఖ్యమందఁ గాఁ
దాదులవారి శిక్షలకు నానతినీయ నియుక్తుఁడ న్గదా! 121

మ. అనుచున్నోరెడి రాజరాజును మహానందంబుతో నల్లి తె
మ్మని యానన్నయకౌఁగిలించి నృపరాడాస్థానవిద్వత్కవీ!
యని లోకస్తుతినంది పామరులకున్ జ్ఞానంబుబోధించి కా
మనచే శంకరనమ్మతంబగు మతోన్మత్తాన్వలం జేసెదన్.

చ. అనుచుఁ బ్రతిజ్ఞనల్పి కవి యంతట రాజును భూషణాంబరా
ళినిగాని కామ్యము స్తని యలేఖ్య విధాశిషమిచ్చి తుష్టితోఁ
జనియెఁగదా! క్రమంబున ప్రజాధిపుఁడగు రాజరాజు తాఁ
దనసఖు గారవించగ నిదాన నిగర్వ మనః ప్రవృత్తుఁడై.

వ. అట్లు నారాయణునితో, 124

తే. ఇంటికేఁగెను ముదముతో నింతి సఖులు
బంధువర్గము బుధులు సంబరమునంద
భళి! యదృష్టము గలిగిన వాని కిచట
గౌరవానకు లోపంబు కలుగునొక్కొ! 125

ఇట్లు చిలుకూరి రామభద్ర శాస్త్రి విరచిత
నన్నయభట్టను బద్యకావ్యమున
ప్రథమాశ్వాసము
సమాప్తము.
శ్రీ సిద్ధలక్ష్మీనృసింహపత్యర్పణమస్తు.

---

శ్రీమహాగణపతయేనమః

# నన్నయభట్టు

## ద్వితీయాశ్వాసము

తే. గణపతి కటాక్షభరిత! యోకనకరాజ!
వైద్యఫల్గున! జయముతో, వరతనూజ
కాండమోద యశస్సుదీర్ఘాయురాది
సంపదలతోడ వర్ధిలు సౌమ్యహృదయ!

వ. ఆవల కథాక్రమం బెట్టెదన. 1

సీ. పుడమిఁగో సుజనుల పున్నెపుమూటయో!
ఠక్కు లేవెలుఁగును తేపెనొక్కొ!
వారాంగనల మోముపైనుండు వెలుతురో!
మునలమ్మ పిం డారఁబోసెనొక్కొ!
ఘన విప్రజపిత యా గాయత్రి శక్తియో!
అలసముద్రుని మందహాస మొక్కొ!
రవికాంతి యీగతి రాజిలుచుండెనో!
తారాపతీ ముఖస్థగిత రుచియొ!

తే. అనుచుఁ బలువురు పలుమాటలాడుచుండ
గురుని యాలిని చేఁబట్టి కొన్నయట్టి

నలువు మొగమున దాలిచి కలువసతుల
తోడ సరసంబులాడఁ జంద్రుండు వచ్చె. 2

వ. అట్టిరాతిరి పురాణము సంపూర్ణమైనది. అరుంధతి పతివ్రతగాన పతిపాదము లొత్తుచుండఁ బ్రసక్తానుప్రసక్తముగా వేములవాడ భీమకవి మాటవచ్చి నన్నయ నారాయణునితో నిట్లు చెప్ప మొదలిడెను - 3

శా. శ్రీమేశుండు సమస్త భక్తజనతా ప్రీత్యర్థమై నిల్వ న్వ
ర్యాభిష్టాఖిలు లాదితేయు లొగి క్షేత్రోద్ధు న్విలాసంబు నా
ధామంబందున దేవళంబు నిలు పద్దాన న్సుఖంబుండె వి
శ్రామంబందగ దక్షవాటిక నహో! శ్వర్వుండు సంసారియై.-

సీ. గణపతి యెలుకతోఁ గలహమాడుచునుండు
స్వాలంకృతుండైన సర్పరాజు
సర్పరాజును గాంచి చక్రనిలేచును
గొమరుసామిరథంబు నెమలిఱేఁడు
నెమలిఱేనిని యాత్మ నములఁగఁ దిఱుఁగు సఁ
టంబికావాహనమైన హరియు
హరిని హరింపఁగా నహరహం బుంకించుఁ
బశుపతివృషభము పగనబూని

తే. గౌరితో గంగ కయ్యానఁ గాలుసాచు
ఫాలలోచన శశులకుఁ బడదుగాదె!

ఇట్టితగవుల మది సహియింపలేక
భీమశంకరుఁడై యిట వెలసె శివుఁడు. 5

కం. వేములవాడ యనంగను
పామరజనభరిత జానపద మా దక్షా
రామమునకుఁ జెంతను వెలసి స్వ
ర్భూమికినివాసియయ్యె భోగయుతంబై. 6

శా. ఈయూర న్నగుణోత్తరుండు ద్విజజాతీశుండు సోమాసి వే
దాయూ సామల దేవరుఁ డుండెను మహాదాంతుండు శాం
తుండుగా
స్వీయంబై యలరారు వేదధనమున్ విప్రార్భకాద్యర్పణ
శ్రీ యాగాన నిమగ్న జీవితుఁడు వాసింగాంచె వ్యాసుండుగా.

తే. అతనినామము యక్షేశ్వరావధాని
వేదశాస్త్రాల నిశిత సంవిత్తుకలదు
సర్వదా శర్వుఁగొల్చుచు ఛాత్రవరుల
సుతులు వీ రేయనంగ దా మతిఁదలంచె. 8

తే. ఈతని తపఃఫలంబుగఁ గూఁతు రొకతె
కలదు సుగుణాలవల్లి యాకంబుకంఠి
నెంతొ గారాబమున బెంచు రేమిచిత్ర
మహహ! యామె రూపగుణంబు లంతవిగద! 9

తే. ఈమెనామము సావిత్రి యీమె నతఁడు
పంచకావ్యాలు కౌముది భారతాది
గ్రంథజాలము చదివించఁ గడఁగి ముదము
తోడ నుండఁగఁ బెండిలి కీడువచ్చె. 10

తే. తల్లిదండ్రులు తాతముత్తాత లుండి
ధారగావచ్చు పాండితీధనుల వంశ
మున వెలయువాసి వరుని కామోహనాంగి
కైన వయసునురూపుఁ దానంతఁ జూచె. 11

తే. కన్నె రూపము, తల్లియా యెన్న ధనము!
జనకుఁడా, విద్య! బంధువా సత్కులంబు!
నితరజనులెల్ల మృష్టాన్న మిచ్చగింత్రు
విశ్వగుణములవాఁడు సావిత్రివరుఁడు. 12

తే. అట్టి వరునకు సావిత్రి నంతనిచ్చి
సంబరంబున బెండిలి సలిపినారు
బంధువర్గము బీదలు బావనయ్య
లన్నవస్త్రాదు లంది రత్యంతతుష్టి. 13

తే. కాని సావిత్రి జాతక క్రమ మదెట్టి
దొక్కొ! పెండిలి వత్సర ముడుగకుండ
పతి గతించెను బందుగుల్ పరిపరి రక
ములుగ నేడ్చిరి దైవము మొఱడువాఱ. 14

సీ. తాంబూలములనాడు ధవుఁడు తెచ్చినయట్టి
చీరకు గడిదైన కెదరలేదు
మధుపర్కయుగ్మము మాయకుండఁగఁ బెట్టె
దాచియుంటినిగాని దాల్చలేదు
పెండ్లిలో నాతని ప్రియముఖేక్షణమైన
సిగ్గుతో నంటచేఁ జేయలేదు
ప్రేమసంగతులైన విప్పిచెప్పుటకయి
తగిన ప్రౌఢత మదిఁ దనరలేదు

తే. ముద్దుముచ్చట లన్నియు మొఱకువాని
ప్రథమసంగమమైనను బరఁగలేదు
మాలదైవము నావతి మంటఁగలిపె
ననుచు సావిత్రి చింతిలె నాత్మయందు. 15

తే. ఇట్టిదుస్స్థితి యటనట హెచ్చుచుండఁ
దెలివిగల నేటివారలు కలఁతలేక
మటల పెండ్లిండ్లు జరుపుట మంచిదనుచు
సంఘసంస్కార మొనరింప సాగినారు. 16

తే. కాని యిట్టి దురాచార కార్యములకు
మునుపు పెద్దలు సైఁపక ముండసంబు
విధిగఁ జేయించి యామె జీవితమునందు
దైవభక్తిని బెంపొందఁ దలఁచినారు. 17

మ. అల సావిత్రియు భర్తృపాదయుగళీన్యస్త ప్రశస్తాత్మయై
కలుషాకార వికార కార్యముల మగ్నాత్మంబయై గాక లో
కులకుం జంకుచుఁదల్లితండ్రులమదిన్ గూఢాత్మయై గొల్చి భేష్
భళి! సావిత్రి యటన్న ఁ గీర్తిగనె ప్రఖ్యాయంబు జెన్నొందఁగా.

తే. నాఁడు శివరాత్రి యుత్సవ మీఁడులేని
సంబరంబున బ్రజలు దక్షాధ్వర భువి
వెలసి యున్నట్టి భీమేశ లలితచరణ
పంకజపు సేవకై యేఁగఁ బఱఁగినారు. 19

తే. కొందఱు ముముక్షువులు, మఱికొందరట, వి
రంసువులు కూడవచ్చిరి; రాజరాజ
రైన గేస్తులు గల్గిన యట్టిచోట
జారచోరులు రాక యేచాయనుంద్రు! 20

సీ. సప్తగోదావర సరసున మునుఁగుచు
విప్రులకిచ్చుచు వెలయువారు
మెట్లపైఁ బేరులమీఁదఁ బాదములుంచఁ
బోక తప్పించుచుఁ బోవువారు,
దేహియటంచుఁ జేసాచు దీనులకే కొద్దొ!
జాలిగొనిచ్చుచు సాగువారు,
అచ్చటనేయున్న అంగళ్ళకేఁగి దా
ఫలములఁ జేఁగొని పరగువారు

తే. ఎదురు వచ్చెడివారిని నదురుకొనుచు
వెనుకదెసనుండి వచ్చు త్రోపిడులధాటి
కాగఁ జాలుచు శివ! శివా! యార్తరక్ష!
యనుచు దేవాలయములోని కరుఁగువారు. 21

తే. ఇట్టియుత్సవ సందర్శనేచ్ఛ కలిగి
పల్లెటూరుల బ్రజలును వచ్చిరందు
భళిర! వేములవాడలో వారు కూడఁ
జిన్నపిల్లలు వృద్ధులుఁ జేరినారు. 22

సీ. ఐశ్వర్యమిచ్చిన నహరహంబును నీదు
జపము చేసెద నను చానయొకతె!
పతి నాకు వశ్యుఁడై బ్రతిమాల ముడుపులఁ
జెల్లింతునని మ్రొక్కు చెనటియొకతె!
పిల్లల కాయువు విరివిగ నిడినచో
స్మరియింతునని పల్కు సాధ్వియొకతె!
అత్త మృతినిబొంద నాత్మజునకు నీదు
పేరు పెట్టెద నను వెఱ్ఱిదొకతె!

తే. నాలుగేఁడులు కావచ్చె నాకు సంతు
లేదు. కల్గిన నీసేవ వాదులాడి
భర్తచేఁ జేయఁ జేసెద, భక్తవర్య!
సౌఖ్య సంస్థాపకా! భీమశంకరుండ! 23

తే. పలువికంబుల కామ్యాళి స్వామిచెంత
నియ్యఁగోరుచు భక్తాళి యుచటనుండ
దనకుఁ దానయి సావిత్రి దాసిఁగోడ
స్నాతయైవచ్చి వీరల సరస నిలిచి, 24

వ. వారి మ్రొక్కుబడుల విని యిట్టు లాలోచింపసాగెను.

క. లంచము లిచ్చువారి నొసలాగునఁ బ్రోచుట, లంచమీనిచోఁ
గొంచెపు జూపు చూచుటయుఁ గోరికల న్దిగనాడఁ జేయుటా!
మంచిని గాంచు దేవునకు మాన్యము మేదలవేలనయ్య! యీ
వంచన నెంచి నీవు నగవా! తగవా? భగవంతుఁడా! విభూ! 26

మ. స్మరియింప న్వరమిచ్చు దేవునకు లంచాలీయఁగా నెంచి తా
వరముల్గోరుచు నప్పు దీర్చి దయమాన్యంతంబు వోనాడి యా
పరమేశు న్గణనాకనన్ గృపణుగా వైశ్యాంశుఁగా లోఁదలం
తురు, భక్తాత్ముల కిట్టి చెట్టయుగునా? శోభింపవే మంచినిన్.

తే. రోగమును మాన్పుటకు దారికొక్కటి గాదె!
స్వీయమంతయుఁ ద్యాగముచేయు, సత్య
తపములకు ముక్తి జీవితాంతమున రాదె!
ఇంతకు న్మించు మార్గ మీయిలను గలదె? 28

వ. అని లోనెంచి యందఱు వినునట్లు వికటముగ
ట్లనెను. 29

తే. తండ్రి! నీవంటి తనయుఁ డుద్భవమునొందఁ
బుట్టెడు జలంబు దీపముపెట్టి నాల్గు
పుట్టెడిసుక నమర్చింతు నట్టులైన
నన్ను బ్రేమించుమయా! దేవ! నాగొనముగను. 80

తే. అనుచుఁ బరితాపమునకయి యామె మ్రొక్కె
యాడువారలతోఁ గూడ నింటికేఁగెఁ
గాలచక్రము చరచరా గదలుచుండ
నొక్కరేయిని కలయందు నపిలయుండ, 81

మ. అతివా! నేనన భీమనాథుఁడఁ ద్వదీయంబైన సద్భక్తి నీ
పతి యాకారముదాల్చి నిన్ను గవయన్ శ్రద్ధంబుగాఁ జేరితిన్!
పతిహీనాత్మవె! నా యొఁబుత్రుఁడగు నీభాగ్యంబు నర్ణ్యంబు! రా!
రతికించు న్నిలువంగఁ గాటవుదమిన్ బ్రౌఢాత్మ యైయుండఁగా.

వ. అతఁ డప్పుడు. 83

చ. పకపకనవ్వుచుండి తనప్రక్కనుజేరెను భీమశంకరుం
డకట! భయంబువీడ నతఁ డాత్మధవాకృతి దాల్చి వేగమే!
వికవికఁ గౌఁగిలించి తనప్రేముడి జూపుచు నామెయోష్ఠమున్
సుకముగ నొక్కి ముద్దుగొని సౌఖ్యముచు సోలుచు నుండెఁ
బ్రీతిమై. 84

మ. స్మరయుద్ధంబున దానొడల్మఱచి యాశ్చర్యంబుతో నాతఁడే
మరుపొంద న్మరిపింపగా నతఁడు భామా! యిట్టిసౌఖ్యంబు నే

నెఱుఁగన్ జనన్మా! యటంచుఁ దత్కాళలఁ దా హింసించి
హింసించి యా
ధరలో నీకు సమానకాంతిగలవా? తన్వీ! యనన్బల్కుచున్.

తే. పోవునవ్వాఁడు సుదతి! "నీపుత్రునకు మ
దీయనామము నిలప మహీయుఁడగు
నంతియేకాని యపవాదు కంత వెఱచి
యుండక తనూజుఁ గాపాడుచుండు మబల!"
యనుచు నంతర్హితుండయ్యె నాథవుండు. 86

తే. అంత మెళుకువఁగాంచి యా యబల వేగ
లేచి జనకుని దాఁజేరి లేపి స్వప్న
వృత్త సంగ్రహమును జెప్పి వెఱఁగుపడుచు
శాంతముఖి సుతి నాతఁడు గాంచి పలికె. 87

సీ. సాటివారలు విన జారిణి యని నిందించి
కులములో వెలివేయఁ దలఁచువారు,
వృత్తిలో మనమును సాధింపనెంచుచు
బాధలఁబెట్టఁగాఁ బఱఁగువారు,
విధవగర్భ మనుచు ద్వేషములోనఁగి
దూషింపఁజేయుచుఁ దొలఁగువారు,
రాకపోకల మాని ఛీకతో 'ఛీ' యని
సర్వత్ర దూషింప సాగువారు,

తే. హర హరా! యెంతకష్టాలి యంటె మనకు
దీని తథ్యము లోక మేటిరుఁ దెలియు
ననుచుఁ జింతించి చివఱకు నాత్మలోన
నన్నిఁటిని భీమశంకరుం డరయఁగలఁడు. 38

తే. అనుచు మనసును రాయిగా నతఁడు చేసి
జాగ్రతను సుతఁ గాపాడఁజాలుచుండి
దశమ మాసాన సావిత్రి తనయుని గన
నమితసంతోషమును బొందె నార్యవరుఁడు. 39

కం. లోకులు కాకు లటందురు
లోకువ యైనట్టివారి లోపము లెంచన్
శోకాగ్నిఁ బరచి బాధల
పోకంగాఁజేయు వీరు శూరులు గారే! 40

సీ. ఎత్తెత్తిపొడుగుల నెడముగ వైచెనే!
యవధాని కూతురా! యనెడివారు,
దేవుఁ డీముండతోఁ దిఱుఁగుట యేకర్మ
మిది యసత్యంబని యెంచువారు,
తొత్తెవండో! ఈమె నెత్తిపైఁబెట్టును
మొలిపింపఁజేసె నవ్వులుకువారు,
అవధాని దేవతార్చనమంత గంగలోఁ
గలిసిపోయెనటంచుఁ దలఁచువారు,

తే. ఏదియేమైననేమింక వృద్ధివియందు
బ్రాహ్మణకులాన కపవాదు వచ్చెననుచుఁ
గులములోనుండి వెలివేయఁ దలఁచువార
లైరి టూ వాడజనులెల్ల నహరహంబు. 41

వ. అట్లు వంశముబట్టి యనధాని ఛండాలసముఁడని గ్రామసీమలోనుంచిరి. ఇది భగవన్మాయగనెంచిన బాపఁడు జపాదులమానక యచ్చటనే సుఖంబుగనుండెను. అంత దాహ్రనకు భీమశంకరుఁడని నామకరణముజేసి గర్భాష్టమమున నుపనీతునిజేసెను. ఏమి కర్మమోకాని యీ బాలునిబుద్ధి యాటపాటలలోఁ బ్రసరించినట్లు విద్యలందుండదు. ప్రాణమువిసిగి యనధాని యూరకుండెను. నుజీయు నాయూరిలో దుష్ట బాలురు నధికులే! వారితో సహవాసము భీమునాకున కత్యావశ్యకమై యాటలలోనే కాలము గ్రోయుంచుచుండును. బాలుర యభివృద్ధికి స్నేహము ముఖ్యముగదా! 42

తే. గోటబిళ్లల నవలీల మీటువారు
గోళికాయల నమముగఁ గొట్టువారు
చెడుగుడాటల జెట్టులై చెలఁగువారు
నాటిబాలురు నాటలపాటవముగ. 43

తే. అన్ని యాటల యందున నారితేరి
నిగ్గుచుండెడి భీమన వస్తైఁజూచి

సైఁపలేనట్టి ధూర్తులు చాలుచాలు
బాబులేనట్టి వాఁడు కాబట్టి పొగరు. 44

౫. అనుచును దూషణల్ పలుప నచ్చటనిల్వక భీమనాఖ్యుఁడా
వినుతగుణాఢ్య తల్లికడ వేగమెపోయి వచింపుమమ్మ! నా
జనకుఁడెవండు? ఆతఁడెట సౌఖ్యముగా వసియించుచుండు నా
కనులకుఁ గానుపింపఁ డిట కారణమేమి! నిజంబు చెప్పుమా!

౬. దాచఁగఁ జూడఁబోకు మిఁక దాచిన దాఁగఁగఁబోదు నీవిఁకన్
దాచుచుఁ జెప్పకున్న మరిఁ దాపము సైఁపక చచ్చిపోదు నం
కోచములేక బాలకులు గూడి ననుం బరిహాసమాడఁగాఁ
జూచితివింటివెయమ్మ! స్మృతిసూక్తము నీమదినమ్మవమ్మరో!

౭. అనుచుం దీవ్రముగా వచించు సుతు నా యజ్ఞాక్షి వీక్షించి యీ
తనయుండివ్విధి చచ్చిపోవునొ! మరేదానం బ్రవర్తించునో!
జనతాపాలక! భీమనాథ! కరుణాపాంగంబుతోఁ బ్రోవు మం
చని నెమ్మిందలపోసి సూనుఁగని పుత్రా! చూడుమం చిట్లనెన్:

౮. దక్షారామ శివాలయాధిపతి నిద్రావ తుల స్వర్వా
శిక్షింపన్ భయమందు భక్తులను రక్షింపంగను ద్యోగియై
పక్షంబేమియు లేక సర్వజనతా పాపాపనోదాత్మకుం
డక్షయ్యుండగు భీమనాథుఁడుసుమీ! ఆతండె! నీతండ్రియౌ.

౯. మదిలో సంశయమున్న నీవు శ్వర నా మాన్యాంకునిస్థిరి యా
పదలందుంటినటంచు మ్రొక్కి యడుగన్ భద్రాత్ముఁడాతండె నీ

కిదియాకీతియటంచుఁబల్కఁగలఁ డీ వృత్తాంబు సర్వంబు నీ
మదిలో శంకలుఁ దీరు నింక, నిల నామాన్యుండె వోగొట్టెడిన్.

తే. అనుచుఁ బలికిన దల్లి యానన్యంబుఁ జూచి
పరితో, పోయెదనని చెప్పి చరచరఁ జని
వేగముగ దక్షవాటిలో భీమనాథు
దేవళంబును గని పోయి తీవ్రగతిని. 50

శా. ఏమయ్యా! ఎవరయ్యా! భీమనట! ఏమీ! మాటలేదయ్యా! యీ
కేమీ! నోరులు లేవటయ్యా! యిఁకనీయిల్లేనటయ్యా! నిజం
బేమో! దాచెదరయ్యా! నామనుజనుండెవాఁడో! భీమన్నట
య్యా! మాట్లాడఁగ రాదటయ్యా! యిఁక నావాస్తాఁ
జావున్నదే! 51

తే. కొడుకువా? నేను, గానయ్య? నడిగఁ జెప్పుఁడి
భీమనతనూజుఁ డనుచును భీతిలేక
తోటివారలు నవ్వుతాల్మాటలాడ
దండ్రి యగువాఁడు సైఁచునా? తనయుఁ గనఁడ?

మ. అనుచున్ భీమనచేతి రాయిఁగొని యాయాత్మేశుపై రువ్వఁగాఁ
జనఁగా నాగుమునిల్వమోనుతుఁడ! నీస్థైర్యానకున్మెచ్చితిన్
జనముల్మెచ్చఁగ నీదు తండ్రినినుమీ! సందేహమేలేదు నీ
కునుజంకేమియులేదు. గోరుదుఁక నీకోర్కెల్ తప్పకుం దీర్చెదన్ 52

తే. అనఁగ నోతండ్రి! యాత్మేశ! యార్యవినుత!
నీపదాబ్జపుపూజకై నిఖిలసురలు
తిరుఁగుచుందురు వారిని గరుణతోడఁ
బ్రోచువానికి నన్గావఁ బోలదయ్య! 53

తే. ఆడినది యాటయై నాకు నలరునట్లు
పాడినది పద్యమై నాకుఁ బరఁగునట్లు
సత్కవిత్వముచేత నే నరసరాజ
సభల దిగ్విజయంబున విభవమందఁ, 54

తే. వరము నిమ్మయ్య! భీమేశ! నాసవాప్తి
తాఁ బ్రేమించుగుండ! నాకును నష్టసుఖమమయ్య!
కష్టపడకుండఁ జదువులు దెలుగునట్లు
వరముకాంతె భీమనయ్య! నందనమరు! 55

తే. అనఁదథాస్తు [illegible] బాయు
మయ్యెఁ గొమరుఁడు భీమన యాత్మలోన
ముదమునందుచు నింటికిఁ బోయి
తల్లి కంతయుఁ జెప్పెఁగా దర్పములర. 56

వ. ఇటులుండఁ గాలచక్రము కొంతదొర్లినది. ఆనాఁ డొకవిప్రునింట వివాహము. అతఁడందఱ నాహ్వానించెను. కాని భీమన కుటుంబమును బిలువఁడయ్యెను. అందులకు భీమన కినిసి

జనముల కందఱును వచ్చువేళ నా పెండ్లియింటి యెదురుగు మీఁద నుపవిష్టుఁడు కాఁగా లోనికేఁగువారు లీతని నిట్లు నిందింపసాగిరి.

చ. భళి! భళి! జారజాంచితుఁడు! బాపురె! నీచ తనూజుఁ డీతఁడే!
పలిత విప్రవంశపు యశంబున కంతయుఁ దోఁకచుక్క యీ
పలిత శిరస్కు తాతకు విపర్యయమున్ సమకూర్చె దేవతా
ర్చలకు ఫలంబుగా నితఁడు జన్మమునొందెఁ గదియకర్మచే.

తే. అనుచుఁ బలురకముల నంద అచట దూష
ణముల గావించి లోనికిఁ గ్రమముగాను
బోవుచుండగ భీమన పొందు మీకుఁ
దగిన గౌరవమును జేయుఁదగు నటంచు. 59

తే. లోన వడ్డన పూర్తియై కానబడఁగఁ
బైకి నిట్లన, భీమన, పలువురువిన
పప్పము లవెల్లఁ గప్పలై యఱచుఁగాత!
అన్న మెల్లను సున్నమై యలరుఁగాత! 60

తే. అనుచుఁ బలుకంగనట్లయ్యె నంతలోనఁ
బాపనయ్యల! ఆకులఁ బారవిడుఁడు.
కప్ప లిల్లంతఁ గప్పలు కప్పలనుచు
నన్నమంతయు సున్నమే యనుచు లేచి, 61

తే. నవ్వుచును బైటనున్నట్టి బాలు భీము
వాక్యమే నిక్కమయ్యెను. వాఁడు నిజము
భీమనాథుని దనయుఁడే పిలిచి గార
వింపఁ దగునంచు మనసున వెఱఁగుఁజెంది. 62

వ. ఆతనిఁజేరి యిట్లనిరి.

సీ. కోపముమాని మాపాపముచూడక
కావుమా! యని వేడఁగడఁగువారు,
తెలియక వెలివేసి కలుష మొనర్చితి
మని బ్రతిమాలఁగాఁ దగువారు,
బ్రహ్మతేజస్సు నీయందె విశదంబు
రక్షింపుమని నేల వ్రాలువారు,
భీమశంకరుఁడీ భీమనయే యంచు
బహువిధ నుతులను బలుకువారు,

తే. తాత యంధానిఁ దల్లిని దత్క్షణంబ
గొల్చికొనివచ్చి పాదముల్ దాల్చువార
లైరి యా యూరిప్రముఖులౌరా! జగాన
పరములేనట్టి నాలుక నానుచుండు. 64

వ. ఇట్లు వారి ప్రార్థనమున నాబాలుఁడు. 65

తే. తప్పులన్నియు నొప్పులుకావలయును.
మున్నమంతయు నన్నమై సొంపుమీఱ

ఖ్యాత యశస్సులో వెలయు వీరు లుదారులు పూసపాటివా
రితని గులంబువారని మనీషులు వల్కఁగ విందుమే గదా! 71

వ. పిదప భీమకవి.

తే. అలచళుక్యపు వంశాన నవతరించి
భూమినేలెడి చొక్క భూమి పతిని
జూచి భీమన దీవించి చూరఁ గొనియెఁ
జొక్క భూపాలు మన్నన సుఖము గొల్ప. 73

వ. ఆ కాలమునందే. 74

తే. రామగిరి దుర్గమున కల రావణుఁడయి
సాహిణీమారుఁ డను మాధ్యసారమూర్తి
ప్రజలఁ బీడించి స్వేచ్ఛగఁ బాలనంబుఁ
జేయుచుండెను వరరాజచిత్త మదర. 75

చ. ఇతనిజయింపఁజొక్కనృపుఁడెంతొ ప్రయత్నముచేసి సైనికుల్
వితత బలాఢ్యులై నడువ వెంటను భీమనవచ్చుచుండ నా
మతిరహితుంకుసాహిణి ప్రమాదము లెంచకద్రిప్పిచొక్కనిన్
బతితుని జేయుచుండఁ గవివర్యుఁడిటుల్ శపియించె సాహిణిన్:

ఉ. చొక్కడనంబుదీవియగు సాహిణిమారుఁడు మారుతై వడిన్
జొక్క తపంగలఁడు చలము న్బలముగ్గల యాచళుక్యులన్

దొక్కన్నృపాలుఁ డుగ్రుఁడయి చూపుల్కల మంటలు రాలఁ
జూచినన్
మిక్కిలి రాజశేఖరునిమీఁదికి వచ్చిన రిత్తవోవునే! 77

శా. ఈశాపంబునసాహిణేంద్రుఁడు మహీహీనుండు తాఁజచ్చెఁ భూ
మీశుండా నలచొక్కఁడున్గవిని తామే మున్నుఁ గాపాడినా
రీశుండే తమరంచు నెంచెద మదిన్ బృధ్వీతలి న్నీ వచః
పాకంబుం దరియింపశక్తులె! ప్రభావాఢ్యుల్ మునుల్ సైతమున్.

తే. అనుచు గవిరాజుఁ బొగడి యా యవనిధవుఁడు
సభను జేయించి పండిత సంఘములను
కానుకిచ్చెడి దొరలును గల్గఁగవిని
జూచియిట్లనె! కవిరాజ! శూరులున్న. 79

తే. ఇట్టిసభయందుఁ దమ శక్తి నేదొ! కొంతఁ
జూపి ముదమును గూర్పుఁడు, చోద్యమంద,
ననఁగ భీమన యేగతి! యనఁగ రాజు
మల్లెపందిరి కంబంబు మ్రానుఁజేయు. 80

వ. అనఁగవి యీవిధమున నాశువులోఁ జదివెను:

*శా. ఆసీతాఖ్య పదాన శృంఖల పదాభ్యాలంభిత స్తంభమా!
నేనే వేములవాడ భీమకవినేనిం జిత్రకూటంబులో

ఘన వ్యాపిత పల్లవోద్భవ మహాపుష్పప్రవ గుచ్ఛంబులన్
నానా పక్వఫలప్రదాయి యగుమా నా కల్ప వృక్షాకృతిన్

కం. అనుచుం జదివిన తోడనె
గన నా స్తంభంబు మ్రానుగా నయ్యెనుఁడీ!
మనమలరఁ జివురుటాకులు
తనకుం గుసుమాలు పండ్లు దనరుచునుండన్. 82

కం. దానికి నంతోషించుచు
మ్రానును స్తంభంబుజేయు మాన్యా! యనఁగన్
దానికిఁ గవిరాడ్భమన
పూనికతో నిట్లు సదివెఁబొగడఁగఁ బ్రజలున్. 83

ఉ. శంభువరప్రసాద కవిజాలవరేణ్యుఁడనైన నావచో
గుంభనసేయ నంతొ యనుకూలతనొంది తనూనభావనన్
గుంభని జొక్క నామనృప కుంజరుపందిటి మల్లెసాలకున్
స్తంభమురీతి నీతనువుఁదాలిచి యెప్పటియట్ల యుండుమా!

తే. ఇట్లు చదివినతోడ నహీనమైన
వృక్షరాజముకంబమై వెలసెనచట
దీనికందఱుతుష్టులై దీవనలిడఁ
గవికిమ్రొక్కిరి బత్తితోఁ గరములెత్తి. 85

వ. అంతట, 86

సీ. శ్రీపతిరాజను సిరిగలవంశావనఁ
బోతరాజను వాఁడు పుట్టె సింగ
న యనెడు తమ్ముఁడు నతుభయంబులఁగొల్వ
గుడిమెట్టయను గ్రామగుండుగనయి
తనతోటలోనికి దర్పమునన్వచ్చు
హయరాజమునుగట్ట నానతిడెను
నింతలో దాని సాహిణివచ్చి యీగుఱ్ఱ
మమ్మో భీమనదంచు నాగుమనుచు

తే. మేము వైదేశికులమయ్య! మీరు వార
మంతియేకాదు మున్నెంచు నింతనుండి
బాగుగాతత హయము నీక్షణ ముచేసి
కదలనీయము వీఁడు శంకరసమాన! 87

తే. మీరె! యీగతిపలికిన మేము వయుప
మాపుకొనవలె, న్యాయమా! యనవిపతి వ
టంచుఁ గబురంపె భీమనయాలయంపు
మనఁగఁ బోతన సాహిణికనియెనిట్లు: 88

తే. భీమనదియైన గావచ్చు భీతిలేదు
కట్టిన హయంబువిడువ మాకెట్టులగును!
పొమ్ముపొమ్మని దూఱఁ గానిమ్మటంచు
భీమనకుఁజెప్పె సాహిణి భీతితోడ. 89

వ. ఇంక నక్కఁడ

శా. అన్నా! భీమన సత్కవీంద్రుఁడవుమిమా! యయ్యోక్కట్యము
స్వీయుమా!
విన్నా వేగఁదా! నీని వాక్సరము లీవే కాదు మున్ముందటిం
బున్నితో మరణింపఁగాఁగలము నీవున్నంబు నీగుణ్ణముల్
మన్నింపఁదగు భీమునాఖ్యానకు విన్నావా! వేగమే నీవనకా.

వ. అను దమ్ముఁడగుసింగననుగాంచి పోతరాజు: 92

శా. చాలుంజాలున్ను నోఁగుమూయుమిఁక నీయింకేలా? భావంబునా
కా? లక్ష్యంబు మదీయుశస్త్రప్రహారిచే ఖండింతు నీదుష్కవిక
కాలుండడ్డమునైన నీనిఁదునన్ క్షాత్రంబులేనట్టినీ
వేలా? తమ్ముఁడవైతి! నాకు జననీవ్యాద్రోహకార్యాగ్రణీ! 93

తే. అనుచుఁ గోపముతోఁ దట్టునధిపు పోత
నాఖ్యానింజేరి సాహిణి యాపయిదినొ
భీమకవిదంచుఁ బ్రశము విడిచిపోవ
దానిని స్వీప్పి చనువఁ బద్యంబదిట్లు. 94

*చ. హయమరసీక పోతవసుధాధిపుఁడారయు రావణుండు ని
శ్చయముగ నేనురాఘవుఁడ జాహ్నవివారిధి మూరుఁకుంజనా
ప్రియుకనయుండు సింగనవిభీషణుఁ డాగుడిమిట్టలంక నా
జయమును పోతరక్కసుని జాడ్యుము నేఁడవనాఁడు చూడుండీ!

వ. అని కవి శపింప. 96

శా. పోయెన్బోతనరాధిపుండు కవితాపూర్ణాత్మ దుర్వ్యావహా
ఘ్నేశుఁడైన యమాంతికంబునకు నాకృష్టాత్మ కర్మంబుచే;
జాయాబృందము భర్తృశోకమ్మృతిఁ గన్, స్వాంతాపహీనాత్ములై
దాయాదుల్ రోదతోడ రాఁజన లసద్దాక్షిణ్యమేపారఁగా.

తే. అంతనందఱు శవమును జింతతోడ
రుద్రభూమికిఁ గొనిపోయి రోదలనిడుచుఁ
జితినిబేర్చిరి రాజులు చెలులు సతులు
పూలఁజల్లుచుఁ దోపిరి పొసఁగవహ్ని. 98

తే. ఇటులె యెందఱో! యిక్కడికేగి తిరిఁగి
వచ్చువారొక్కరును లేరు వసుధయందు
భిక్షుకుండైన రాజైన బ్రియునితోడ
స్థలము నిచ్చును రుద్రభూసమతి! యహహ! 99

తే. సర్వవర్ణాలవారికి సమశిలిచట;
పెద్దనిద్దుర కిద్దియే పృథివిఁ బృథివి;
సకలప్రాణుల విశ్రాంతి సౌఖ్యదాయి
ఈశ్మశానంబె! ఈశునిగృహ మటండ్రు. 100

ఉ. అంతట భీమనక్కవియు నా తెఱవ్రానిచనంగఁ జూచి యా
చింతిలువారు పోతనసుశీలలఁబిల్చి యెదోవచింప నీ

వ. ఇట్టి మహనీయుఁ డిచ్చటకు రానున్నాఁడని వింటిని. ఈతని దర్శనమున దరింపవచ్చునని నారాయణుఁడన "స్వామి రాతిరి మూఁడవజాము కానున్నది, శయనింత" మని నన్నయ పలుకుటచే నందఱు శయనించిరి. 106

ఇట్లు చిలుకూరి రామభద్రశాస్త్రి విరచిత

నన్నయభట్టారక చరిత్రమున

ద్వితీయాశ్వాసము

సమాప్తము.

ఓం తత్సత్

శ్రీ సిద్ధేశ్వర గణపత్యర్పణమస్తు.

---

శ్రీమహాగణపతయేనమః

# నన్నయభట్టు

## తృతీయాశ్వాసము

తే. సకలమానవ సంతుష్టి సలుపుచుండి
గుప్తదాతగవర్ధిల్లఁ గోరుచుండి
దీనబంధువుగా ధరఁ దేజరిల్లు
కనకరాజును గావుమో గౌరితనయ! 1

వ. అనంతరవృత్తాంత మేమనగా.

సీ. ఒకనాడు సభలోన నొప్పుచునుండిన
బండితావళిగాంచి పరచళుక్య
వంశరత్నము భూమిపాలకుండగు రాజ
రాజనరేంద్రుండు సాజమైన
జైనవ్యాసవ్యాచు సిద్ధహాస్తులుమీరు
హిందూమతవివృద్ధి కేల జతన
మైనను జేయరు దానిచే భీభత్స
బౌద్ధమతవ్యాప్తి పరఁగుచుండ

తే. విత్తమీయఁగ రక్షణ వెలయఁజేయఁ
గత్తిఁజేబూని రాజులు కలుగుచుండ

బుద్ధిబలమున యోజించి బుద్ధమతము
పారఁద్రోలుట పాఱులపనియగాదె! 2

తే. నాకుఁ జిరకాలమునుండి నయయుతంబు
భరతవంశీయచరితము భారతంబు
వినఁగఁ గోరిక మదిలోన వేడ్క మించు
దాని తెనిఁగింపనర్హులు త్వరగ లెండు. 3

వ. అనఁగ నొకరు మాటాడువా రుండకపోవ రాజు—

శా. ఏమయ్యా! సభలోన బండితులు లేనేలేర మాటాడరే
మేమయ్యా! యొకసత్పురాణము తెలుంగింప స్వశక్తి లే
దేమయ్యా! యిది జాతికంతకు దోసంగే కాదటయ్యా! యికన్
భూమిన్ మీకు సమానపండితులు న్వాహ్యానువ్య లేరందురే! 5

వ. అననొక పండితుఁడు లేచి,

సీ. శబ్దశాస్త్రజ్ఞుని జనకునిగా నెంచు
భ్రాతగా న్యాయశాస్త్రజ్ఞుఁ జూచు
పండునిగా నెంచు జమునిమీమాంసకు
నాదరింపక పరిహాసముగను
ఛాందసోత్తముఁ గాంచు ఛండాలసమునిగా
వేదాంతగునిగాంచుఁ బిచ్చివాని
ఇతరశాస్త్రజ్ఞుల నీక్షింపగాఁ బోక
దుర్మార్గులని మెంచి తొలఁగుచుండు

తే. తనకుఁ దానయి వరియించు దయితుఁడనుచు
కవితయును స్వప్రేమశోభఁ గావ్యములను
లలి యలంకార శాస్త్రములెల్లయు వాని
కవిత చెప్పఁగ నూకెల్లు కలుగుశక్తి! 7

వ. ఇఁక నా భారతమా! 8

*సీ. ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహమని
యైతిహాసికు లితిహాసమనియు
పరమ పౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యంబని మహిఁ గొనియాడుచుండ

ఆ. వివిధవేదతత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరఁగుచుండఁ జేసె భారతంబు. 9

క. అని పలుకఁగ నొక్కఁడు
తెనిఁగించెద నంచు లేచు ధీరుఁడు లేమిన్
జనపతి నన్నయ సుకవిని
గని కరుణాదృష్టితోడఁ గాంచుఁ దలిర్పన్. 10

*సీ. తనకులబ్రాహ్మణు ననురక్తు నవిరళ
జపహోమతత్పరు విపులశ్రద్ధ
శాసను సంహితాభ్యాసు బహ్వృచదాన
నానాపురాణవిజ్ఞాననిరతు
పాత్రు నాపస్తంభసూత్రు ముద్గలగోత్ర
జాతు సద్వినుతావదాతచరితు
లోకజ్ఞు నుభయభాషాకావ్యరచనాభి
శోభితు సత్కృతిభాభియోగ్యు

ఆ. నిత్యసత్యవచను మత్యనురాధిపా
చార్యు నుజను నన్నపార్యుఁ జూచి
పరమధర్మవిదుఁడు వరచళుక్యాన్వయా
భరణుఁ డిట్టులనియెఁ గరముప్రీతి. 11

*క. జననుత కృష్ణద్వైపా
యన మునివృషభాభిహిత మహాభారత బ
ద్ధ నిరూపితార్థ మేర్పడఁ
దెనుఁగున రచియింపు మధికధీయుక్తి మెయిన్. 12

వ. అన నన్నయ లేచి. 13

*చ. అమలిన తారకాసముదయంబున నన్ను సర్వవేద శా
స్త్రముల యశేషపారము ముదంబునఁ బొందను బుద్ధిబాహువి

క్రమముగ దుర్గమార్థజలగౌరవ భారత వాహినీ సము
ద్రము దఱియంగ నీదను విధాతృనకైనను నేరఁబోలునే!

తే. ఐనఁ బ్రభు కార్యమగుటచేఁ బూని యతన
మొనరఁ జేసెద నూరకయుండఁ దగునె!
విధిసహాయుఁడును తీవ్రక వేదయానన్న
మనము చేయు ప్రయత్నంబు మంచిదేని. 15

తే. అనుచు వినయంబుతోనుండి యఖిలకార్య
ధూర్వహుండగు నన్నయ తృప్తినొంద
కాదు భూపాల! శక్తియా! లేకగాని
మీదు సంకల్పబలమున మోదమునరు. 16

తే. నేటిదాకను దెనుఁగులో నియమబద్ధ
మైన వ్యాకృతి వెలసియుఁ గానఁబడదు
ముందు దానిని రచియించి యొందరకను
భారతంబును దమవాత వ్రాయఁగలను. 17

వ. దాని నియమమ్మెట్టిదన :

*ఉ. సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తిలో
నారసి మేలునా నితరులక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగున న్మహా
భారతసంహితారచన బంధురుఁడయ్యె జగద్ధితంబుగన్. 19

వ. అని ప్రజలందఱు వొగడఁగ భారతరచనలో — 20

క. కన్నడ భాషావనుమతి
నన్నఁగ శ్రీభారతంబు సృష్టించి జగ
త్సన్నుతిగను నారాయణుఁ
డన్నఁగ నా భారతంబు కీర్తుంజోచ్ఛా, 21

*ఉ. పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు నా
రాయణుఁడట్లు తాను ధరామరవంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుఁడుం దనకిష్టుఁడు న్సహా
ధ్యాయుఁడునైన వాఁడభిమతంబుగఁ దోడయినిర్వహింపగన్.

వ. భారతమును నన్నయ తెనిఁగించినాఁడు. 23

క. అని ప్రజలెల్లరు వొగడఁగ
జనపతివా నీవు మెచ్చఁ జంద్రకులోత్థుల్
జనపతుల సచ్చరిత్రము
వినఁగాఁ దెనిఁగింతు వేగఁ బృథ్వీధవుఁడా! 24

మ. అనగా నందఱు మెచ్చినారు సుజనాయుత్తుంకు రారాజు నా
తనిగాటఁబుగఁ గౌఁగిలించె నటమూత్యాదుల్ త్యాగప్లేదియా
కనకస్నాన సువస్త్రదానమణిసత్కారాది భూషావళీ
ధనధాన్యాదులనిచ్చినారు కవినిష్ఠన్యుంచవీ వేయునన్. 25

వ. పిదప నారాయణభట్టు సాయమున నన్నయ విశ్వశ్రేయః కావ్యమని ఆంధ్రశబ్ద చింతామణియను దనుఁగు వ్యాకరణరాజము రచించె. 26

తే. అరయఁ బంచపరిచ్ఛేద భరితమగుచు
నార్యలెనుబదిరెండయి యలరుచుండ
నన్నపార్యుని వ్యాకృతి సన్నుతిగనె
భారత గ్రంథరచనాతిబంధురుండు - 27

*శ్లో॥ శ్రీవాణీగిరిజాశ్చిరాయ దధతో వక్షో ముఖాంగేషు యే
లోకానాం స్థితి మావహ న్త్యవిహతాం స్త్రీ పుంసయో
గోద్భవామ్
తేవేదత్రయమూర్తయ స్త్రిపురుషాస్సంపూజితా వస్సురైః
భూయాసుః పురుషోత్తమాంబుజభవ శ్రీకంధరా శ్శ్రేయసే.

వ. అని భారతరచన కుపక్రమించినాఁడు నన్నయ. 29

సీ. ఆనాటి కాభినయ్యాఖ్యుఁడు శ్రమియించి
కవిజనాశ్రయమును గట్టినాఁడు
ప్రౌఢంబు రాఘవ పాండవీయంబను
శ్లేషప్రబంధము చేసినాఁడు
పండితుల్మెచ్చఁగాఁ బ్రశ్నలక్షణమను
కబ్బమునొకదాని గాంచినాఁడు
వశ్యవాక్కయి భూమిపాలురపూజల
నంది దేశములందు నలరినాఁడు

తే. గారవించినవారిని ఘనులఁ జేయు
నెదిరినిలిచినవారల నిట్టె చంపఁ
బాదములఁ బట్టువారల బ్రతుకఁజేయు
భీమనాఖ్యుని పేరన భీతికలిగె. 80

తే. అట్టిభీమన నన్నయకట్టె నాంధ్ర
శబ్దచింతామణి నటంచు శ్రవణపుటల
ఒద్దమాత్రాన క్రోధసంబద్ధుఁడగుచు
నతని జూచి జయించెద నంచు వచ్చె. 81

వ. అట్లు రాజమహేంద్రనగరికిఁ బోయి నన్నయ మందిరద్వారము కడకేఁగిచూడ ... 82

సీ. అదే! రాజవీధిప్రక్కదే! నన్నపార్యుని
రుచిర గృహంబని చూడఁగాదె!
ప్రాకారమధ్యలో ఫల పుష్ప భరితముల్
వృక్షపంక్తులు గోచరించుగాదె!
అందుఁజూడఁగగోవు సద్దాని వత్సయు
నత్సుకత్వము గొల్పుచుండుగాదె!
దానిప్రక్క తులసి కోటసిల్లుమనుండు
అలయరుంధతి పూజ లందుఁగాదె!

తే. రంగురంగుల పుష్పాలు వంగి యతిథి
వారముకు గారవాన సంబర మొనర్ప

వీధివాకిట ముగ్గులు వెలయుచుండ
ద్వారబంధవుఁ దేజ ముదాత్తమయ్యె. 33

వ. ఇఁక నన్నయ విద్యా వ్యాసంగవు గది. 34

సీ. గోడలపై నుండె, గోపాలపాండవ
రామాది చిత్రముల్ రాజిలంగ
నేలమీఁద నలరు రాలపై బొమ్మలు
పైన దివాసీలు పరువఁబడిన
హంసతూలికతల్ప మా మధ్యనొ ప్పారు
నాసనంబులు ముఁగ టలరుచుండ
ఖాఁదిసీగుడ్డలు జాలర్లు ముత్యాల
తోరణంబులు తులఁ దూగుచుండ

తే. ద్వారముల వారికుంభము ల్పరిఢవిల్ల
ధూపవాసన లంతట నేపుమీఱె,
గదికి మధ్యన నొక పెద్ద గద్దె. దాని
యెదుట నింకొక యాసన మిమిడియుండె. 35

సీ. వెడఁదమైన నుదుట వెలయు భస్మంబది
తిలకద్వయంబుతోఁ గలితమగుచు
తామరరేకుల, దలఁదన్ను నేత్రాలు
సంతోష రేఖల జార్చుచుండ

చక్కనవిధముగా ముక్కు సుందరమయి
చెక్కుళ్ళ యందంబుఁ జెంగలింప
దానిమ్మ గింజలై తనరు పల్వరుస తా
వాఙ్మాధురిని గూడి వరలుచుండ
పోగులకాంతిలోఁ బోల్చశక్యమె! కర్ణ
ములు శష్కులీకాంతి వెలయుచుండ
నెఱసిన నున్నని నెఱివెంట్రుకల ముడి
మల్లెపూ మొగ్గయై యుల్లసిల్ల
స్ఫటిక మాలలపైన భాసించురుద్రాక్ష
మాలలు మెడలోన గ్రాలుచుండ

తే. తెల్లవలువలఁ దాలిచి తేజరిల్ల
దర్భముడి యుంగరంబులఁ దళుకుమనుచు
వ్రేళ్ళుకలిగిన చేతితోఁ రేయి పగలు
వ్రాసి చదువుచునుండెడి బావఁడొకఁడు. 86

తే. అదిగనుచునుండి సద్దుపాటిదియొ దిద్దు
మనుచు నింకొక పాఠముఁ వినుచునుండ
నిట్టితరి నొక్క విద్యార్థి యేఁగుదెంచి
భయము భక్తియు నొప్పార వందన మని, 87

తే. బైటనున్నారు వేములవాడ భీమ
కవి వరేణ్యులు తమరిని గాంచఁగోరు

చుంటిమని పల్కిరని చెప్ప నుభయులంత
వరగునన్వచ్చిరక్కవి సత్కరింప. 38

వ. భీమకవినిగాంచి నన్నయ యీరీతిపొగడెను -

*చం. మతిఁబ్రభసీగిఁ బేర్మిసిరి మానము పెంపున భీముని న్బృహ
స్పతిరవిఁగర్ణు నర్జునుఁ గపర్ది సుయోధను బోల్పఁబూననా
మతికరి తైత్ణు దుష్కులు నమానుషు భిక్షు ఖలాత్ము లంచు వా
క్పతిపు శశి స్శిబి న్గొమరుసామిని మేరువు నబ్ధిఁబోల్చెదన్, 

వ. అంత నారాయణభట్టు 41

కం. మీరన్న వశ్యవాక్కులు
కారే! పాత్రాలనెల్ల గంటమె వ్రాయున్.
భూరమణపూజలందుచుఁ
గీరితితో నుంటవింటిఁ గేల్మోడువఁదగున్. 42

వ. అంతభోజనాదుల యనంతరమున. 43

తే. అపుడు వారలు మాటాడునంతలోన
రాజదూత యొకండు పత్రంబునొకటి
నన్నయకు నిచ్చి వెడలెను. దిన్నగాను
అతఁడు గాంచెను దానినత్యంతముదము. 44

ప్రాసియున్నట్టి యాదిపర్వంబు నేను
పండితులలోన జదువ భూపతియనుజ్ఞ,
భీమసత్కవి! సభకును వేగరమ్మ
టంచు వారందఱున్ లోనికరిగినారు. 45

సీ. ఉపభోజనాదులు నడిగినతరువాత
విడెమును గ్రహియించి విశ్రమించి
రాజ సభోచిత భ్రాజిత వేషంబు
దాల్చియా ముప్పురు ధరణిపతి స
మీపమునకుఁ జేరె మేరురనంతోప
చిహ్నముల్ ముఖమున జెంగలింప
నట సభాభవనంబు నతిరమ్యమైయొప్పె
రాజ విద్వద్రాజ రాజితోడ

తే. స్వర్ణ సింహాసనంబున స్వర్పతివలె
రతనముల కూర్పు పీఠిక రాజువోలె
సరస సామంతపూజిత చరణుఁడగుచు
రాజరాజనరేంద్రుండు రాజిలంగ. 46

వ. అట నానభాస్థలియందు.

సీ. ఒకచోట శాబ్దికు లొప్పుచు నుండ నిం
కొకతట్టు తార్కికు లొనరుచుండ

నొక చాయ ఛాందసు లొప్పారుచుండ వే
ఱొక ప్రక్క శైక్షికులుండఁగాను
ఒకవంక జ్యోతిష్కులుండ నింకొకమూల
లలినిరుక్తులు సుఖాలాపులైరి
ఒకతలి ధర్మజ్ఞ శుకాలుండ మఱియొక
ప్రక్కన గురువులు వఱగుచుండ

తే. వంది మాగధు లొకపంక్తి వరలుచుండ
పటువిదూషక చేటులు సంచరింప
రాజమార్తాండ సత్కృతుల్ రాజిలంగ
నిండు పేరోలగంబుండె నా నరేంద్రు. 48

సీ. వజ్జియుప్రగడయు నగ్గమునఁ శివగ్యుఁడు
రాజునకొకప్రక్కఁ దేజరిలఁగ
నృప కామసేనాని నిలిచిరి, ముప్పరా
జ్జననాథ రాజము దండపులును
నాణ్యదేవుఁడనెడు నరపుఁడు సామంత
భూపుఁడింకొక తట్టు పొలుపుమీర
పంపనభట్టను బరను మీమాంసకుం
డొకచోట శివితో నొప్పుచుండ

తే. చెట్టనయు భీమనయు ముట్ట భట్టులొకట
బిల్హణుఁడు కృష్ణమిశ్రుఁడు పేరలొకట

తే. భళిర! యమ్మంగదేవి తాఁ బ్రకటనొప్ప
దీటులేకుండ రేవలదేవి యలర
సింహపీఠిపై రాజసింహమనఁగ
రాజరాజు సుఖాసీన తేజుఁడయ్యె. 53

వ. అంత రాజును వందిమాగధులీగతిని వర్ణింప మొదలిడిరి. 54

సీ. హారినాభి కమలమున దవతరించెను బ్రహ్మ
యతని మానసపుత్రుఁ డత్రిమౌని
అతనికిఁ జంద్రుఁడే యాత్మజుఁడయ్యెఁ ద
దన్వయు విజయాదిత్య నృపుఁడుండె
ఆతఁడు శూరుఁడై యా దక్షిణాపథ
మున [illegible] రాజుఁడును త్రిలోచ
నునకు రణమున గల్గ నా రాజు మరణించె
రాట్పత్ని గర్భభారాలస యయి,

తే. అగ్రహారంబు ముదివేము కరుగఁ జేర
విప్రుఁడై సోమయాజియై విష్ణుభట్టు
మతిని గా నీమెఁ గాపాడ జొచ్చినాఁడు
కనియెఁ గా విష్ణువర్ధను గంజనేత్రి! 55

వ. ఆ విష్ణుభట్టు సోమయాజియే మానవ్యగోత్రికులు హారీతి తనూజులగు రాజనందనులకు వలె నీ బాలునకు జాతకర్మాదుల నాచరించి పెంచి పెద్దవానిజేసెను. ఒకనాడు తల్లి వలన తండ్రిసంగతి తెలిసికొని చాళుక్య గిరిపైనున్న భగవతియుగ

గాంగవలన శ్వేతాతపత్ర శంఖ పాలికేతన, ప్రతిఢక్కా వరాహ లాంఛన పింఛ, కుంత, సింహాసన, మకరతోరణ, కనక దండాదుల నొంది కదంబగాంగాది రాజులజయించి త్రిలోచన పల్లవుని నోడించి యాతని యపత్యము, ఉత్తమ యనుదాని నుద్వహించి సేతు నర్మదామధ్యగతమగు నేడున్నర లక్షల యోజనములు వైశాల్యముగల దక్షిణాపథము నేకచ్ఛత్రాధిపతిగ విష్ణువర్ధనుఁడు పాలించెను. ఈతని వంశసంభూతుఁడు విమలాదిత్యుఁడు. ఈతనిసంతానమగు రాజరాజనరేంద్రుఁడు చోళ మండలాధిపతి వదాన్యశిరోమణియగు రాజరాజు తనూజయగు కుందవాదేవిని పెండ్లాడెను.-అట్టి 56

తే. పరమరాజేంద్ర సింహాసనా! బహుపరాకు!
మహావిరాజిత! రాజరాడ్బహుపరాకు!
బహునృపాతత పాదాబ్జ! బహుపరాకు!
పరమచాళుక్యకులచంద్ర! బహుపరాకు! 57

వ. అని పిదప నన్నయ నిట్లు పొగడిరి. 58

సీ. బహుపరాకయ్య! యో పండితమండలీ
భాస్కర! నన్నయభట్ట! నీకు
బహుపరాకయ్య! యో పదశాస్త్రసూరీంద్ర!
ముద్గలగోత్రోద్ధ! ముదితచరిత!
బహుపరాకయ్య! యో పావనాశక చర
ణార్చనాజీవనీ యాంధ్రవాణి!

నారాయణాఖ్య కరుణారసపూర్ణ వీర!
శ్రీరమ్య! రాజకుల శేఖర! దివ్యమూర్తి! 63

శ్లో. జయతు శుభమస్తు శ్రేయోఽస్తు! సాహసాంక!
జయతు నిత్యోత్సవశ్రీ సుసంభవాఢ్య!
జయతు రాజనరేంద్ర! సచ్చక్రవర్తి!
జయతు సార్వణచంద్ర! తే జయతుజయతు. 64

వ. పిదప నీవిధముగ రాజుతో మనవిచేసెను.

కం. శాపానుగ్రహశక్తుఁడు
భూపాలసభాంతరముల బొగడంబడు నీ
బావఁడు భీమన నెఱుఁగుదె!
భూపాలక! రాజరాజ! పూజ్యచరిత్రా! 65

తే. అనఁగ భీమన భూపుఁడు వినఁగఁ బలికె
రాజరాజ! భవత్కీర్తి సాజమగుచు
సకలదిశలందె కాదయ్య! సర్వలోక
ములను దేవపురిఁ గావింప మొదలుపెట్టె. 66

శా. భూపశ్రేష్ఠుఁడవంచు నిన్ను బొగడన్భూపాల! యేతెంచి సం
తాపోద్విగ్నత మానుపించు భవదాంతర్యంబు వీక్షింపఁగా
భూపా! పండిత తాపమారదె! భవత్పుణ్యాం బకణ్వంబు నా
తాపంబార్పఁగఁ గాన్పకన్నఁ గొనుమీ! ధాత్రీశ్వరా! పార్థివా!

వ. అని సకృతజ్ఞతాపూర్వకముగ నామముల వెల్లడించుచు,

తే. నాడు కృతికన్య సంభావన కనకము
తోడ సాపత్న్యభావంబు వేదు మందు

అప్పుడే నీయశఃకన్య యభయయగుచు
దేశదేశాల దిఱుఁగుచుఁ దేజరిల్లె. 69

చ. అనఁగ నృపోత్తముండు కవి కంజలి మోడిచి భీమసత్కవీ!
వినుము మదీయమానసము విశ్వశుభంకర మాంధ్రభారతం
బునుగృతినొందియుండిపయిపాత్రములన్ గ్రహియింపనెంచెనీ
కనువుగ గారవించు మనుహర్ష మొనర్చెద నన్ క్షమించుమీ!

ఉ. భావమునందు వేడుక విభావన చేయక నాదుకోర్కె సం
భావనఁ జేయవేడెదఁ గృపాపరుఁడీవు మహాంధ్రభారతం
బీ వసుధాస్థలి న్నిలుప నీక్షణఁ జేయు వరంబొసంగి మా
భావము పండఁ జేయవలె భానుసమాన! కవీంద్ర భీమనా!

మ. అనియా రాజనరేంద్రచంద్రుఁడు ద్విజాబ్జాంఘ్రిద్వయంబంటినా
మనవి న్స్వీకృతిఁ జేయ వేడెద నన వ్యాసత్యంబు భీమన్న నీ
మనసా! భారతి లగ్నమయ్యె మదమున్నాన్యంబు మత్స
త్కృతిన్
వినఁగాఁగోరెద నీసభన్నృపవరా! వీక్షింపు నాకోరికన్. 72

తే. అనుచు రాఘవపాండవీయమున గొన్ని
పద్యములఁ గవిచంద్రుఁడు పఠనఁ జేయ
నంద ఆహాహా! యటంచు నానందమంద
భీమసత్కవి బాగాయటంచుఁ బ్రీతుఁడయ్యె. 73

క. ప్రతిపద్యంబున కర్థము
మతి గొలఁదిగ విస్తరించి మంచిగ నుడువన్

ప్రతివారు సంతసించిరి
కృతికన్యక సంతసంబుఁ గేరితి నిడదా? 74

క. అంతట నారాజేంద్రుఁడు
వింతగ నా భీమసుకవి వేషకఁ జెందన్
సంతసము పొంగఁ గొల్చెను
సంతుష్టిని బొందురాజు జగములనిడఁడే? 75

తే. కంకణంబులు శాలువల్ ఘనముగ నిడి
ఈవి బంగారుస్నానము నిచ్చి పిదప
నగ్రహారాలు తాపితా లవనిధవుఁడు
ఈయ భీమన దృష్టి నిరీక్షఁ జేసె. 76

తే. అంత నృపచంద్రునానచే సంతసమున
నన్నయయు భారతమునందు నాగెములగు
గొన్ని పద్యాలు చదువఁగాఁ గొంచుజంకు
లేక ప్రారంభముజ్జేసె సోకముదము. 77

ఉ. భారతపద్య భాగములు పండితసన్నృభఁ బద్ధమాత్రనే!
భూరమణుండుచూచెను ప్రభూతిముదంబున సభ్యులందఱున్
బీర! భళీ! భళీ! భళిర! ఆంధ్రమునందున బద్యమన్న నీ
తీరున నుండఁగావలెను ధీవరుఁ డన్నను నన్నయాఖ్యుఁడే!

ఉ. ఏమిః! రసంబదేమి! కథ యొద్దియ పాకము నూర్గనంబు నే
మేమి? సుధార! యాచితియు నెందునుగన్గని ముద్దుగూరు పే
మేమియు సాధుతాగరిమ! ఇట్టి సుభావములెందు గంటిమే!
ఈ మహి నీ కవిత్వము మహీయము పుణ్యవశాన వింటిమే.

సీ. బంగారు కలమును రంగారఁ జేబట్టి
అమృతరసంబులో నద్దినాఁడొ!
చక్కఁగాలో ముంచి సంస్కృతగ్రంథాలు
కదుపు కడగ వ్రాసి కనినాఁడొ!
ఆంధ్ర భూమాతకి యంద [illegible]
ముత్తెములం బోల వా[illegible]నాఁడొ!
పద్యములవ్రాసి భట్టనారాయణుని
నంగీకృతి గ్గొని యలరినాఁడొ!
తే. బ్రహ్మజాతికి ముఖమునై వరలినాఁడు
తెలుఁగు బాసకు దీపమై నిలిచినాఁడు
భావుకీర్తికి మూలమై పోలినాఁడు
నన్నయార్యుని కీడగు నరుఁడు గలఁడె! 80
శా. మా గోదావరి నీరుద్రావు జనుఁ డున్మత్తాత్ముఁడే గాని దూ
రోగాధీనుఁడు గాని మారకముచే మూఢాత్ముఁడుం గాని గ
ర్భాగారంబున నున్నఁగాని కవితాభాగ్యప్రపూర్ణాత్ముఁడై
భోగప్రాతము నందుచుంట సహజంబు గ్గాదె! మా యూరిలో.
తే. ఉల్లముల్లాసముం బొందుచుండఁ జేయు
పిల్లగాలులు చల్లగా వినరుచుండఁ
దనరు గోదావరీనదీ దర్శనమున
గవిత రాదొకో మతిలేని చవటకేని. 82
మ. అని యానందనిమగ్నచిత్తులయి యయ్యాశ్వాసవశిప్రవరుల్
జననాథాగ్రణి ధన్యజీవి గదా! జైనంబు బౌద్ధంబు లీ

మనజాతి న్వీడనాడి పోవుటకు నీమాన్యస్తుతుల్ జెంద నీ
కను ఏ సత్కవితా ప్రవాహ మమృతంబై పాఱె లోకాళిలో.

కం. ఇట్టి కవిత్వము వినుటకు
నిట్టి మహాకవిని గాంచి యిష్టము నొందన్
ఇట్టి మహారాజును గన
నెట్టిది పుణ్యంబుఁ జేసి యిలఁ బుట్టితిమో! 84

కం. సుకవిత కలిగిన రాజ్యం
బకలంకంబైన నేమి! యను సూక్తి నిజం
బిఁక నీకుఁ బట్టె నన్నయ
సుకవీ! నీయంత వాఁడు సూరులఁ గలఁడే! 85

తే. అన్ని గానములు నొక గ్రంథమందు లేవు,
నన్నయ కవీశు గ్రంథాన నన్ని గలవు,
శారదాదేవి యాతని శ్రమకుఁ జేరెఁ
గష్టమందిన సంతుష్టి కలుఁగదొక్కొ ! 86

చ. గడియకు వేయిపద్దెములఁ గట్టఁగఁజాలు నితండు మర్త్యుఁడా!
గడియకు వేయిపద్దెములఁ గట్టిగ వ్రాయఁగ నిద్దిగంటమా!
గడియకు వేయిపద్దెములఁ గట్టి పఠింపఁగ నిద్దికంఠమా!
దడదడలాడి యాతనికి ధారుణి కైవశమౌచు నిల్చదే! 87

ఉ. ఇట్టి మహాకవీంద్రుని యభీష్టము దీర్చుచు భారతంబుఁ దా
న్నెట్టులొ వ్రాయఁజేయు సుకృతి[illegible] మహా[illegible] [illegible]ధన్యుఁడీ

కెట్టుల నిర్వరంగనగ జీవిత సార్థకతా మహాత్త్వ మా
కిట్టులభించెఁగాఁ బ్రతుకఁ వృద్ధులు శోభనవంక్తిఁ గాంచరే!

తే. ఆదికవి! యంచు నారాయణాఖ్యభట్టు
అవని, వాగనుశాసనా! యనుచు రాజ
తీవ్రమైనట్టి ప్రేమయే తేలవడఁగ
నన్నయను గౌఁగిలించి రానందమంద. 89

తే. అనుచు బహువిధ వాక్యము లిట్లనగఁ బలికి
సభ్యులందరు నానంద సాగరంబు
నంమునఁగియు వినుతుల నలరఁ జేయు
రాజరాజయ్యె, సంతోష భ్రాజితుండు. 90

ఉ. అంతట భీమసత్కవి కవాంకృతి హెచ్చి మదీయ పాండితిన్
వింతలఁజూపి వీరలకుఁ బ్రీతిని గల్గఁ జేసి నన్నయన్
వంతలపాలు చేసి బలవంతముగాఁ గృతికన్యకామణిన్
జెంతకుఁ జేర్చు రాజునకుఁ జేసెద భారతమం దనిష్టముల్.

సీ. వయసుచేఁ జూతునా! పదివదేండ్లమ్ముల్
చిన్న నాతన్న నీ నన్నిభట్టు,
పాండితిచేఁ జూడ బహువిధ గ్రంథముల్
చదివియుంటివి నాకుఁ జాలఁ గలవు.
యశముచేశినటన్న! ఆర్జించి యుంటివి
సకలదిగీశులు సంస్మరింపఁ

గవితలో ఘనుఁడన గటకటా! ద్వ్యర్థికా
వ్యములను రచియించి పరఁగియుంటి

తే. ఎంతవారైన శపియించి సుంతఁగరుణ
గలుగ వరమిచ్చి బ్రతికింపఁ గలను. నేను
ఇట్టి ననుఁబీడి నన్నయ జెట్టి యనుట
పున్నములచేతఁ గీరితి పొందుటగద! 92

తే. ఇది సహింపఁగరానిది యిటులె యూర
కున్న నింకెంతయానొకో యుర్వియందు
స్పర్థచే విద్యవృద్ధియౌ స్పర్థలేక
నన్నగిలుచుండుఁ బండితశ్రములు గావె! 93

తే. అని మనంబున బొందె, భీమన్న బాధ,
దీనిని యసూయయందురు ధీరు లవని
ఇదియె క్రమముగ హెచ్చఁగ నిట్టి లేది
పారిషదులార! వినుఁడు నావలుకు నొకటి. 94

ఉ. వ్యాసుని భారతంబునకు న్యాయ్యవుఁదెన్గిది కాదు, స్వేచ్ఛ చే
భాసితపద్యకావ్యము గ వ్రాయుచునుండె నితఁడు, దీనినే
వాసియుగల్గు దానిగఁ బల్కి నుతించుట వింతఁజెల్లె నా
మోసము, చెప్ప లే యెడఁబూన్యనాటాముదపున్నగంబెగా...

తే. అనుచుఁ బరిహాన ఫణితి భీమన్న పలికె,
నవనిలో నెంతవారలు నైన గాని

ఇంద్రియావళి కెల్లఁ దామిట్టులొంగి
మాయలోఁ బడుచుండె నే మానవుండొ! 96

వ. ఈయసూయ [illegible] చేతను కేవ [illegible] దానఁ గలుషవంతులయి విద్వా[illegible] చే[illegible] [illegible]వార లయి, పాపపంకిల పతితులయి [illegible]దుర్గ్రముల [illegible] లొంగిన వారయి, జీవితపరమార్థమునే వశింపఁజేసికొందు [illegible]తులు. ఇట్టివారల నట్టివేదవిద్యలు పవిత్రులఁ గావింపఁజాలవు. 97

సీ. విద్వాంసుఁడని విన్న విద్వాంసుఁ డగువాఁడు
మాటాడ నేరఁడు మది ననూయ
ఒకవైద్యుఁడున్న నింకొక వైద్యుఁ డా యింట
మాటాడ నేరఁడు మది ననూయ
ఒకభార్యయున్న నింకొకభార్య పతితోడ
మాటాడ నేరదు మదిననూయ
ఒకభ్రాతయున్న నింకొక సోదరుండేమి
మాటాడ నేరఁడు మదిననూయ
తే. పుడమి ననహానగుణమును బొగడఁగలమె!
దేశములు కూడ మారుట దీనివలన
నరులు కలహించి రణములో మరణమందఁ
దరచు నిదిగాదె? హేతు వీ ధరణియందు. 98

కం. ఇట్టి యనూయఁ గ దానలఁ
దట్టే యయినట్టి భీమనార్యుని క్రోధం

భిట్టిదని నొక్కి వల్కఁగ
పట్టెను! బాధాకృతి నాటి పరిషదమునకన్. 99

సీ. అంత నా [illegible]గుం డింతయ సూ[illegible] యా!
[illegible] రల వృద్ధి పెద్ద[illegible]
సంతుష్టి [illegible] ట సంస్కృ[illegible] బోక
దూఱఁగాఁ జెల్లునె! దూరముఁదు
నందు సూర్యుఁడు పద్మతండంబులకుఁ దుష్టి
[illegible]చ్చి వీక్షింపఁడా! మెచ్చుకొనుచు
ఆనాటి కౌశి[illegible] డా రామభద్రుని
జన[illegible]రా శేంద్రుని సహితయుంపు

తే. నాశిషంబుల నిచ్చి జయ [illegible]
నటులఁ జేయఁడె! మాబోంట్లయందుఁ దమరు
కరుణఁ జూపింపవలెఁగాని కల యనూయఁ
బైటఁబెట్టఁగఁ జెల్లునె! వరకవీంద్ర! 100

సీ. నన్నయ్యభట్టు జనతను సామాన్యుఁడా!
చీఁకటిగానున్న చిన్న తెనుఁగు
బాసకు వ్యాకృతి పరిఢవిల్లఁగఁ జేసి
భారతంబును లక్ష్యభాగముగను
ముద్దగు బద్దెముల్ ముద మొనర్పఁగ వ్రాయు
చుండెఁగా నాంధ్రికి శోభకలుగ

ఇందుకు మెచ్చని మందులు నుందురా!
షడ్రసోపేత భోజనమువీడి

తే. నిందచేసెడి వారుండి రిందటంచు
నేను తెలియంగ వచ్చి మీగోష్ఠివలన
మిమ్ము భూపతియిప్పుడే మిక్కుటముగ
గారవింపంగ నీనొప్పి గానవడదె! 101

మ. అనగా భీమనలేచి కోపమున నా యాంతర్యభావంబునుం
గనగాఁ బోవక మందుఁడంచుఁ బలుకన్ గంగారు నీకేల? ఈ
జనతా మాన్యము నన్నభారతము! తాసంపూర్ణమైగాకయా
తనితో నింతకునాగిపోవుట ముహూర్తాదుల్ సమీక్షింపఁగా.

మ. అన నారాయణభట్టులేచి సముదాయత్తంబుగా వల్కె నా
రని మీరాఘవపాండవీయకృతి యత్యంతప్రశస్తిం గనం
జనఁగాఁ బోదనినాకుఁ గోపపడెనుసీ! సందేహమింకేల? యాం
ధ్రిని మాభారతమే జగద్ధితముగా దీపించు సంపూర్ణమై. 103

ఉ. ఎంత వివేకమున్న మఱియెంతటి పాండితి గల్గియున్న విం
కెంతటికీర్తియున్న మనసెంత యథార్థముపల్కుచున్న మీ
కెంతటి రాజశేఖరు లహీన విరాజిత గౌరవాళి యిం
కెంతగనున్న నంతవృథయే! యశస్సాయతి గొప్పదానుఁడీ!

వ. అంత నన్నయభట్టారకులు పలికెను. 105

ఉ. లోకము బాగుచేయుటకు లోఁబడియున్న కవీశనామ మ
స్తోకముగాను దాల్చి జనశోధను గోరుచు విప్రవంశ ని
ర్మోక శశాంకతుల్యుఁడగు మోక్షము నందగనిచ్ఛగించు ధీ
పాకము గల్గియుండు మన పాకము మించఁగఁ జెల్లునా? కవీ!

తే. అనుచు నెవరంతట నార్చ లఁగినారు
ద్విజకులారావఘోషతోఁ దిజేఁగి రవియు
మాయమయ్యెను జాగ్రుఁడా! మంచి వెలుఁగు
భువిని వెదఁజల్ల వచ్చె సంపూర్ణుఁడగుచు. 107

ఇట్లు చిలుకూరి రామభద్రశాస్త్రి విరచిత
నన్నయభట్టారక చరిత మను ప్రబంధమున
తృతీయాశ్వాసము
సంపూర్ణము.

శ్రీ మహాగణపత్యర్పణమస్తు.

---

# నన్నయభట్టు

## చతుర్థాశ్వాసము

తే. గణాశీ! ఖండఖండాలఁ గలయఁదిరిగి
స్వాగతుల సూత్రకథమును వీడఁబోక
హై  స్వ్రముః లిపిన ఆగ్యానతుఁడు
కనకరం జును గావుమా! కవిగాంబూని. 1

వ. అవల చరితం బెట్టిదన — 2

తే. అల కళింగపు దేశస్థ మైనయట్టి
విజయనగరపు రాజని విపులకీర్తి
గన్న రాజా లింగ గంగరాజుఁజూడ
బయన నెవ్వన భీమన పరమునకవి. 3

తే. అది వసంతర్తు వై యుట నలరుచుంట
నేడఁజూచిన సంతుష్ట హృదయజనులు
కానుపించఁగ భీమన ఘనుఁడు వేగ
మదిఁ దలంచెను దారిద్ర్య మమతవశత. 4

ఉ. రాజమహేంద్రవర్యుఁడు విరాజితభక్తిని గొల్చెఁగాని నా
తేజము చూడఁబోక కవిధీరుఁడు నన్నయయంచువల్కె నా
కా! జయముబ్బకుండఁగ నిరాయత విద్యుఁడు నన్నిభట్టు తా
నాజిని రావణానురుఁడునై వడిగా సిరికడ్డువచ్చెనే! 5

శా. ఈలోపంబును దీర్పకర్తృఁడు కళింగేశుండు దానొక్కఁడే
వేలా! ఈతని జేరి నమ్మిఁ గొనగా నే మార్గముంబట్టెదన్

కాలంబేగతి సంబరాన గడువంగా నింక నేనేర్తు! నీ
డోలాందోళిత మానసంబు శమమందు! న్నెందు నాకింతటన్

తే. అనుచు భీమన కాళింగు నంతిపురికి
నేఁగ ద్వారపు లతని బ్రవిష్టునతికిఁ
జేఁరటులు కల్గఁ జేయఁగాఁ జేరి రాజ
దర్శనము చేయ వీలుపడదని కార! 7

వ. అంత భీమన కళింగున కీ పద్యము నంపెను. 8

మ. ఘనుఁడ న్వేములవాడ వంశజుఁడ దక్షారామ భీమేశ నం
దనుఁడన్ సర్వవిషామృత ప్రకట నానాకావ్యధుర్యుండ భీ
మన నా పేరు వినంగఁ జెప్పితిఁ గళింగాధీశ! కస్తూరికా
ఘనసారాది సుగంధవస్తువుల వేగందెచ్చి లాలింపరా! 9

తే. పద్యమును జేనిదూతచేఁ బంపి సుకవి
ద్వార దేశము చెంత నిదానమలరఁ
గాఁచియుండగ వచ్చె నిష్కరుణు దూత
గొప్పనంతయు నడకలో నొప్పఁజేసి. 10

తే. ఓయి! ఏమనినాఁడు మీ రాయొడయుఁ డిపుడు
నన్ను గొనిరమ్మనుచుఁ జెప్పి నిన్ను బనిచె
నా? యటంచుఁ గంగారుతో నతఁడు లేవ
పీలులేదని చెప్పి రీవేళఁ జూడ. 11

ఉ. అనుచును దూతవల్కు హృదయంబున గోపము వృద్ధిజెంద నా
కును పరి వీలులేదనెనె! గోముఖధారియు, వ్యాఘ్రు రాజు! కాం

12

తిని మరియొక్కపద్యమిది దీనివిజావుము వానికంమఁ ద
గని రయొక్కాగితంబొకటి కాంత్షుఁదలిర్పఁగ దూతికిచ్చఁగ

*కం. శాపాను గ్రహపటువును
బాపాడెడి కవులనెత్తి అంపంబనఁగా
భూపాలసభలఁ బూజ్యుఁడ!
నాపేరే భీముఁడంద్రు వరవర! సభలన్.

తే. దూత యాపద్దెమున్గొని తొలఁగిపోయి
తిఱిగి వచ్చియు మారాజు మఱలవెనుకఁ
జెప్పినట్టి యుత్తరువును జెప్ప వనఁగఁ
బట్టలేనట్టి కోపాన బలికె నుకవి.

*ఉ. వేములవాడ భీమకవి వేగమె! చూచి కళింగగంగుఁ దా
పామువమాని కోపమున సందడి తీరినవెన్క రమ్మనెన్
మోమిటుఁజూప దోషమని ముప్పదిరెండుదినంబు లావఁ
జామున కర్థముం దతనిసంపద శత్రులపాలు గావుతన్.

శా. ఈపద్యంబును జెప్పి భీమకవిపోయెన్ పద్యభావంబు నా
భూపుండా! విని తత్తరంబువడియెన్ పూర్ణాజ్ఞ లీరాజకా!
అప త్తున్నదటంచువల్కిరి మహిమాత్మ్యల్ విచారించి యా
భూపున్నిందితుఁజేసినారు కవిసన్మానింపుఁడంచు న్వసనీ

వ. అంత కళింగగంగు అనచరులతో,

శా. కానీ! చూచెద భీముశాపమున నేకష్టంబు ప్రాప్తించునో
పోనీ! శత్రువులేరు కాన్పడరు పావుల్ నన్నుభక్షింపఁగా

రాణీ! వచ్చినయాపదల్ దరియలేరా! మీరు లెవ్వేళ మే
మానీచు న్గానివచ్చి వూజలిడ బాయన్నే ర్చునే? కష్టముల్.

చ. కవులకుఁ బండ్లువీకవలెఁ గాకవులన్ జెఱ పెట్టఁగావలెన్
కవులకు నీరహారముల కట్టడిజేయుచుఁ జంపఁగావలెన్,
కవులు రచించుఁ బొత్తముల కట్టలు నగ్నిని వేయుగావలెన్
కవులువసించు గేహములఁ గాల్చినవారికిఁ గానుకలిచ్చెదన్.

కం. పెట్టిన శౌండ్లి యటంచురు
పెట్టనిచో శ్రాద్ధమంత్రము, వీరిని గొలువన్
దిట్టలు భూపుల కెవ్వరున్
బట్టును గష్టాళి దొట్టి పరముల కేగిన్. 19

సీ. కవులను బూజించు గటికివాండ్రకు శిక్ష
వారి యాస్తులు రాజవశములగుట
కవుల యువన్యాస విపణుల కౌశిక్ష
వారి కేన్యాయంబు వరలకుంట
కవులతో మాటాడు గపటాత్ములకు శిక్ష
వారరపాంక్తేయులై పరఁగుచుంట
కవుల గ్రంథంబులఁగాంచి చదివిన శిక్ష
నాలుకలోక్కయుట న్యాయమగుట

తే. కవులు గ్రామంబులోనికిఁ గాలుపెట్ట
కుండ భటులను గాపలా నుంచినాఁడు.
కవులు పద్యాలు వ్రాసిన గ్రామదహన
మనుచుఁ బుట్టించెగాఁ బుకార్లవనిపుండు. 20

తే. బాలహత్యలు చేయగాఁ బరఁగినారు
తా ముపాసించు దేవతాతర్పణ మని
వ్యభిచరించినచోఁ గైత వచ్చుననుచుఁ
గాంతలను బాధచేయగాఁ గడఁగినారు. 21

తే. నీతు లనుపేర వ్రాసిరి బూతు కథల
మోక్షదంబని శృంగారములగుఁ గతల
వ్రాసిజనులందు గౌరవ ప్రాప్తమంది
బ్రతుకుచుండెడి కవులు దుష్పాపయుతులు. 22

తే. అనుచుఁ దన కిష్టమాఁగతి నవనిపుండు
కవులపై నపవాదులఁ గలయఁగట్టి
యతనయును జేసి వారిదౌ యశమునంతఁ
బాడుచేయగ నెంతయో పాటుపడియె. 23

తే. రాయ రీతని రిపువు పరాక్రముండు
కవివరేణ్యుని శాపము గడువకుండ
వర్థరాత్రాన సైన్యము నవనిపతిని
చుట్టుగఁ గొట్టుచుఁ బారఁగాఁ జేసె నపుడు. 24

ఉ. రాజ వరారియయ్యె, విడరా! యని కేకలుపెట్టి రాణియా!
సైజముగాఁచుగొంటకు వినాశనమందెను, మంత్రిశండమా!
భోజసమాన రాయులవిభూ! యని వేడఁగఁబోయె, రాజ్యమా!
రాజసమాన కాంతిగల రాయల కైవసమయ్యె వెంటనే! 25

మ. ఉదయంబయ్యెను రాజమారేవిజయోత్సాహంబుదీపింప నం
వద సాంపాత దివాణమంతఁ దమసౌభాగ్యాన ముండింది నా

ర్పదయుండంచు నృపేంద్రురాయుల ప్రశంసావాక్య జాతో
న్మదా
వృమఁగావించి రమాత్యులీతఁడుభువిన్ బాలింపరాజయ్యెగా!

శా. కాళింగుండటనుండిపోయియడవుల్ గట్టుల్ నదుల్ దాటుచున్
దోలాందోళితచిత్తుఁడై త్వరజయింతు న్నీనినేలా! యంటం
చాలోచించుచుఁబ్రాణరక్షణము జేయన్బల్లెటూర్లందుఁ దాఁ
గాలంబీడ్వఁగఁ జేరెఁ గర్వితులకక్కాలం బొకేరీతియా! 27

తే. బోయలుండెడి కూడెమే భూపవరుని
గావురంబయ్యె దైవము గడువవశమొ!
ఇది స్వయంకృతమేగాని యితరదోష
మేమియు న్లేదటంచుఁ దానెంచె నాత్మ. 28

మ. కవులన్ దిట్టితి వారికబ్బములవేడ్కన్ న్మెచ్చి వేయించితిన్
కవినాథుండగు భీమనాథునిని దుర్గర్వాప్తిచే నెంతయో
నవమానించితి దర్శనంబొసఁగకే కవ్వాని శాపంబుచే
శివములీడితి రావణాసురుఁడనై శిక్షించితిన్నెటికిన్. 29

మ. ఎవరెన్నెన్ని విధాలుచెప్పిన హిహీహీ యంచునేవల్కినా
నెవరీకార్యము కూడదన్న మనవిన్ హేళంబుగా నెంచినా
నెవరేమైనను రాజ్యమత్తతను నాహృద్యంబు కాదంటి నా
కెవరీడౌదురు దార్ఢ్యమందునకటా! హీనుండ దుష్కర్మచే.

తే. అనుచుఁ బరితాపమున రహస్యమున నచటఁ
గాలమీడ్చుచు నుండఁగాఁ గలయదృష్ట

వశత నొకరేయి భీమునిఁడా పథముఁబట్టి
పల్లకీ నెక్కిపోవుచుఁ బల్లెయనుచు. 31

తే. ఆగి యచ్చటనారేయి నతఁడు వేగ
బోయులం బిలిపించి యోబోయులార!
పల్లకీమోయుగా రండు పలుదకముల
దొడవు లిచ్చెద మీకు సంతుష్టికలుగ. 32

తే. అనఁగ నందఱు సంతోషమంది రాత్రి
రనక పల్లకిమోయుగా నందులోన
నున్న వాఁడుంగుఁజూచి భీమన్న పొగ్చి
రాజలక్షణభాసిత తేజుఁడనుచుఁ, 33

తే. దలఁచి యెవ్వఁడవోయి యాంతిగ్యమిచ్చి
పలుకు సత్యంబటంచునా బావఁడనఁగ
భీముకవి శాప మందిన భిక్షుకుండ
పేరు రాజకళింగు, మాకూరు లేదు. 34

వ. అని రాజు కవిపాదములఁబట్టి 35

శా. నీపాదాంబుజముల్ మదిన్నిలుపుచున్నిరూపునే నెంచుచున్
నీపుణ్యాకర కార్యజాలముల సంపూర్ణంబుగా వ్రాసి హృ
త్పాపార్ణ్యాకుతాగ్నమై పరఁగునా త్వన్మంత్ర రాజంబు హృ
త్పాపంబుల్ చెదరన్జపించెదఁ గవీంద్రాధ్యక్షు! భీమేశ్వరా! 36

శా. అయ్యా! జ్ఞానము తెచ్చుగొంటిని త్వదీయంబైన సచ్ఛక్తిచేఁ
గుయ్యో! మొఱ్ఱో! యటంచు నుంటిని మహాకోపంబు నీ
వొందఁగా

ఘయ్యంబీజయలక్ష్మి శత్రుగణమై సౌఖ్యంబుతోనుండె నా
కియ్యస్యేదెద నాదురాజ్యరమ సామీ! భీమనాథావ్యయా!

ఉ. ఉత్తము కోప మొక్క క్షణముందును నీచులకోపమంతురా!
తత్తరపాటులేక వితతంబయి చచ్చెడిదాక నుండి లో
కోత్తర దుష్టకార్యముల యోజనచేయఁగఁ బ్రోత్సహించు నీ
యుత్తమశక్తి నాదయిన నుర్వినినీయఁగఁ గోరెదన్ ప్రభూ!

ఉ. అందిన జుట్టుపట్టుదురఁ టందకపోయిన గళ్లుపట్టు భూ
మందిరపాలకుల్ నృపులు మాన్యులు కారని యెంచఁబోకు విూ
కుందగునట్లు పూజలిడు గొప్పనరేంద్రులు హానిసేయ రే
మందులొనాదుబోఁ ద్లుధనమూదకులుందురు బాధలందుచున్

చం. అనికవి పాదపద్మయుగమందునబడ్డ కళింగగంగు నా
ఘనమతి భీమనాథకవి కాండవరేణ్యుఁడుఁ రాజ్కళింగ! నీ
మనవిని జిత్తగించితిని మాన్యపురాజ్యము నీకుఁగల్గు లె
మ్మనుచును లేవఁదీయుఁ దనహస్తము చేతనులేపి యిట్లనెన్. 40

*చం బిసరుహాగర్భు బ్రాతయును విష్ణునిచక్రము వజ్రివజ్ర మున్
దెసలనురాము బాణము యుధిష్ఠురుకోపము మౌని శాపమున్
మనశపు బొ ము కాటుమగుమూరు శక్తియుఁ గాలుకండమున్
పశుపతి కంటిమంట యును బండితవాక్యము తప్పవే! 41

వ. అయిన నీ ప్రార్థనము గీకరించితినని,

*ఉ. వేయుగజంబులుండఁ బదివేలతురంగములుండ నాజిలో
రాయలఁగెల్చి సజ్జనగరంబును బట్టముగట్టుకోవచ్చిన్

రాయకళింగగంగు కవిరాజభయంకరమూర్తి వాఁడు డాఁ
బోయెను మీసమీసమున బున్నమిపోయిన పష్టినాటికిన్.

తే. అన, నమస్కారమొనరించి యవనిధవుఁడు
సంతతానంద డోలికాజాల విహర
మాణచిత్తంబుతో నేఁగె మహితయశుఁడు
భీమకవి యోజనేయుచు వెడలుచుండె, 44

సీ. తనుదీయుగోలితోఁ దానవడెనటంద్రు
తన దిట్టుతనకునే తగిలెనంద్రు
తనవిద్య తనదుష్ట దర్పకారణమంద్రు
తనశాపశక్తి పాతకమటంద్రు
తనకోపమంతయుఁ దననష్టికేయంద్రు
తనసుతుల్ రిపులని ధరణినంద్రు
తనరూపవతియగు దారయేమృతియంద్రు
తన ధనమే పావతండమంద్రు

తే. ఆశివంబున బోయె నటంచుఁబలుకు
నాదు మృతికంచు మదిలోన నమ్మవలయుఁ
గాలముం గర్మముంగూడఁ గలసిరాఁగఁ
గష్టసుఖములు ధరణిలోఁ గలుగుచుండు. 45

ఉ. నన్నయదూరినాను నృపనాథుఁడు రాజనరేంద్రుడూటి నా
కున్నయశంబువీడితిని యుక్తముగాదొకో! మృత్యువందఁగా
మన్ననలంది విద్యలప్రమాణపుశక్తిని మట్టిపాలుచే
సె న్నిజమంచునెంచరె! యిసీ! ధరనన్నటువంటివారలున్.

సీ. అని విచారించుచు నతఁడింటికేఁగఁగాఁ
దల్లికత్యున మసి కానుపడఁగ
నది యేమిటమ్మా యటంచుఁ బృచ్ఛించుచు
మృత్యువునాకు నీదృశ్యమనుచుఁ
దండ్రి భీమేశుని దలఁచుచు నుండఁగా
దివ్యమువేఁ దల్లి దివికేఁజనెను
తనకర్మ మనుచును మనమున యోజించి
మాఘశుద్ధవు షష్ఠి మంచిదనుచు

తే. నాఁడె దేవేంద్రుఁ జూడఁగా నాకమునకుఁ
జిత్తశాంతిని బొందఁగాఁ జేరె నకట!
అలకళింగుఁడు రాజ్యమునందివాఁడు;
అందఱున్ హర్షచిత్తాల నందుచుండ.

ఇట్లు నన్నయభట్టు చరిత మను బద్యకావ్యమున
చ తు ర్థా శ్వా స ము
స మా ప్త ము

ఓం తత్సత్
శ్రీ సిద్ధిలక్ష్మీగణపత్యర్పణమస్తు

శ్రీమహాగణపతయేనమః

# నన్నయభట్టు

## పంచమాశ్వాసము

తే. గణపతీ! పుత్రపౌత్రులు గలుగుచుండఁగ
నూటయేఁబది వర్షముల్ వాటిలేవి
భాగ్యమాయు స్సుఖంబుల వఱలుచున్న
జనకరాడ్దంపతుల వేగఁ గావుమయ్య! 1

వ. అంత వర్షాకాలము సమీపించెను. 2

సీ. కుంభవృష్టిగ వాన కురియుచుండెను గదా!
వేసవితాపంబు విరుగుచుండఁగ
కుంభవృష్టిగ వాన కురియుచుండెను గదా!
అవనులుడ్డీలతో నవ్వుచుండఁగ
కుంభవృష్టిగ వాన కురియుచుండెను గదా!
ఓషధీజాలము లుదయమందఁగ
కుంభవృష్టిగ వాన కురియుచుండెను గదా!
పాంథవనితల సంబరము కనఁగ

తే. ప్రాగ్వ్యమీఁదికిఁ గ్రిందికిఁ బార్శ్వమైనఁ
దండులంబులు కాష్ఠముల్ తగిలియున్న
దంపతులకెల్ల సుఖదమై తగినదైన
పుణ్యవార్షిక ఋతువును బొగడఁదరమ! 3

వర్ష ఋతువున సతులతో వరలువారి
సౌఖ్యమింతంతయని చెప్ప శక్యమగునె? 5

సీ. కర్షకులకునెల్ల వర్షముచేతనే
విశ్రాంతి సమయమై వెలయునిద్ది!
వర్షాభి వర్జిత పాఠోపదేష్టల
విశ్రాంతి సమయమై వెలయునిద్ది!
వానచే బేరాలు వాడినవణిజుల
విశ్రాంతి సమయమై వెలయునిద్ది!
ఉద్యోగి వరులకు నుచ్ఛ్వాసముంగాన
విశ్రాంతి సమయమై వెలయునిద్ది!

తే. కాంతలకునెల్ల విశ్రాంతి కలుగఁబోదు
పశువులకు నింకనరకంబు పరఁగ లేదు
పాంథజనులకు వేఱు తుపాకిలేదు
వర్ష ఋతువును వర్ణింప వశమె నాకు. 6

సీ. కుంభవృష్టిగ వాన కురియుచునుండఁగా
నతిథులువచ్చి రత్యంతముదము,
తల్లియాబ్దికము, నాడిల్లాలు బైటుండెఁ,
దండులాలింటిలో నిండుకొనియె,
తనయుపత్యము రోగ తన్మయత్వముచేత
మరణసంసిద్ధమై మంచమెక్కె,
స్వర్గమేఁగెను గోవు పశువుల దొడ్డిలోఁ
బందిరిదొడ్డిలోఁ బడియెఁగొన్ని,

తే. వంట కనివచ్చి యాప్రక్క వనితకూడ
బైటనుండెను గులసతి వరుసయందు
చెంబు బొంతను జాపను జేతఁబట్టి
గేస్తు తాఁగూడఁ బైటుండె గృహిణిచెంత. 7

తే. వానకాలవు చదువులవలెను సకల
కార్యజాలము మందమై కానుపడును
సకల రోగసమూహవు చక్రవర్తి
వర్షఋతువనఁ గ్రూరార్తి వక్రవర్తి. 8

ఉ. ఇంతటలోన భీమకవి యేఁగెను స్వర్గముకంచు నన్నయ
స్వాంతమునందుఁ దోఁచెను విచారపరంపర గల్గఁ గమ్మరయా!
అంతటలోన నాతని దృగంతరవర్తిగ నయ్యె; కాని కా
సంతయుఁ బట్టలేక మది నాదికవీంద్రుఁడు పత్నికిట్లనెన్. 9

మ. కవినాథుండగు భీమసత్కవి స్వకర్మాధీనుఁడై కాల ధ
ర్మవశీభూతుఁడటంచు వింటిని, మహామాన్యుండు భీమేశనా
నువరుండై ధరఁబుట్టి కీర్తిఁగని సన్నుత్యుండుగానై వచో
భవకీలాల నిపాతచూర్ణితుఁడుగాఁ బ్రధ్వంసుఁడయ్యెన్సఖీ! 10

శా. భూపాలీయ సభాంతరాళ నుతి సత్పూజాదులం బొంది యే
పాపవ్రాతము నందఁబోక సతమాపద్బాంధవున్గొల్చుచున్
శాపానీకముచేత దుష్టతతి శిక్షాధీనులంజేసి ధ
ర్మావన్నంబుల సత్కృతుల్ గొనుచుభీమాంకుండుచేరెన్దివిన్.

శా. దక్షారామ కృపావిభూతి కలనా తాత్పర్యజాతుండు న
ధ్యక్షుండై సుకవీంద్రసంతతులమాహాత్మ్యంబుసాటింపుచున్

పక్షంబేమియులేక దీనుల దయాస్వాంతంబుతోఁ బ్రోచు నీ
యక్షయ్యుండగు భీమసత్కవి సురాధ్యక్షాలయంబేఁగెనే! 12

ఉ. నూటికి నొక్కరైన గవినూతనులా! యుదయించఁబోరు తొ
ల్పాటున బుట్టిన న్సుకవివర్యులు భవ్యులుకారు వారు తా
నాటికినొక్కఁడున్న గవిసంఘము వానినిమెచ్చఁబోదు మో
మాటమిఁకేల? భీమకవి మాన్యుఁడె! ఆంధ్రకవిత్వభానుఁడా.

తే. పెద్దవాఁడగు భీమన పృథివివీడి
స్వర్గపురిఁ జేరియుండె నిస్సంశయంబు
ఆంధ్రకవులకు దిక్కెవరయ్య! నేడు
కవుల కాధారభూతుఁడు సుకవిఁ యెవఁడు? 14

తే. అని విచారించు నన్నయఁగనుచు భార్య
యగు నరుంధతి నెచ్చెలియైన వాఁడు
సుకవి నారాయణాఖ్యుఁడు శోకమునుప
శాంత్వవచనాల బలికిన శాంతిలేదు. 15

తే. అట్లు నన్నయ బెంగచే నంతలోన
మంచమెక్కెను సతియుఁ దా మంచమెక్కె!
సతికి నిద్దియ ధర్మము జగమునందు
లక్షకొక్కరు నేడు దుర్లభలుగారె! 16

కం. అంతట నన్నయ కుశలము
నింతి కనారోగ్యబాధ వృద్ధంబయ్యెన్
జంతువుల కష్టసుఖములు
చింతింపఁగ నేరితరము చిత్రంబిదియే! 17

తే. ఆయరుంధతితార యీయమ్మఁ జూడఁ
దలఁచినను గానుపడదట ధరణియెల్లఁ
దిటుఁగుచున్నట్లు గన్పడు దీపవాస
నలును నాసిక కెక్కవు పలురకముల. 18

తే. అద్దమందున బ్రతిబింబ మామెచూడఁ
బోను స్వప్నములో నొక్కపురుషవరుఁడు
'దివ్యలోకాల జేర్చెద ధీరవగుచుఁ
బుణ్యకార్యాల జేయు' మన్ బొంగసిపలికె. 19

చ. అదిగని యామె భర్తకసత్తైన రహస్యముచెప్ప నాతఁ డా
పదలను రానెఱింగి తనభార్యనుగాంచి విచారమంద నీ
కిదిసమయంబు కాదనుచు హెచ్చరికన్బలుకంగ వేగ నా
సుదతి వ్రతంబులన్నిటిని శోభనము ల్బడయంగసల్పెఁగా. 20

తే. ధన్యరాలవు నీవంచు దయితుఁడనను
సతివినీవే! యటంచు నా సుతుఁడువలికె
అబలకింతికు మించిన ఆశయేది?
అనుచు నారాయణుండు దా వినఁగఁ బలికె. 21

ఉ. అంతట నాపతివ్రత ప్రయాసములేక నె గల్గుముక్తి నా
కింతట నంచు నెంచి పతినే తనమానసమందుఁ గొల్చుచున్
నుంత విచారమందక స్వసూనుని జిన్నయఁ జూచి గ్రుడ్ల నీ
రెంతయుఁ గార్చుచున్బలికెఁ గృత్యవిదుండవు నీవు నాయనా!

వ. నీ కుపదేశింపఁదగినది లేదు. కాని, 23

తే. పురుషునకు భార్యతరువాత పుత్రులుగద!
సౌఖ్యహేతువు లెంతయు జగమునందు
మన్ననలఁజేసి భార్యను మఱువఁజేయు
తనయులే యిహపరలోక ధన్యతములు. 24

తే. పతిని గోల్పోవువానికి సంతుకూడ
నవకరింపఁగ నాతని కవని విసము
భీష్ముఁడా! తండ్రి సుఖజాలవృతుని జేసి
ముక్తిగాంచెను మరణవిముక్తితోడ. 25

తే. ఇంతియేగాదు పితృాజ్ఞ హృదయపూర్వ
కముగ నెరవేర్చు రాముఁడు ఘనుఁడుగాఁడె!
మాతృపితృసేవ మదిలోన మరువఁదగదు
తనయులకు నింతకన్నను ధరణిలేదు. 26

చ. జగతిని ధర్మబీజముల జల్లెడి కర్షక చక్రవర్తులా
ఖగపతి వాహభక్తులు జగద్ధితులుం గవు లంచునెంచు మేఁ
దగనువచింప నంచెఱిఁగి తత్పరతం బలుకాడుచుంటి నీ
సగముశరీర మీాజనకు సౌఖ్యముకై వినియోగపర్చుమీా. 27

వ. అంతఁ బతిఁగాంచి,

సీ. భూలోకమనెడొక పొగబండిలోనెక్కి
నిలిచెదు తావులఁ గలయువారు
అచటనేయెక్కుచు నత్యంతముదముతో
దమయూరు పయనింపఁ దలఁచువారు

దాఁటిలోఁ గలిగిన దగవులన్నె హాల
రిపుమిత్రభావముల్ లేవు వాం
న్నుబున్నమనుచుఁ గాళులజావుచుఁ
జ: లనుబాధింపఁ బరఁగువారు

తే. ఎఁతకినివారలై పోదురెట్టిమనుజ
లైలలేకుండఁ దమపను లెంచుకొనుచు
జన్మజన్మాంతరీయ సంసారబద్ధ
దారసుతులని మది మమకారమేల? 28

మ. అహ!హా!యుంచని గౌగిలించుకొని ముద్దాడ బ్రకాశించి యీ
యిహామంచా మెనుఖాళికై మగఁడు నన్నే కష్టముల్బొందియీ
మె హసింప స్థనమిచ్చి యంతమున నామీనాక్షి దేహంబు న
గ్ని హరింప న్బడ వేయఁడా? ధవుఁడు మూకీభూతచేతస్కుఁడై.

ఉ. తొమ్మిదినాసముల్పొయిచి మూర్ఖమహానూనులటంచు నెంచుటన్
ముమ్మరమైన మోహమున మోదమునందుచు వారిఁ బెంచి పై
కమ్మను వారికిచ్చి కులకన్యల వారికిఁ బెండ్లిసేయు లో
కమ్మున దల్లిదండ్రుల విఘాతుక నిప్పునవేయు ధర్మమా. 30

మ. తనకెంతో సుఖమిచ్చి తుష్టినిడ సర్థంబెల్ల వెచ్చించి సంసారభా
గినియంచు న్మగనెంచి పుత్రులగన న్గేంతలం గొట్టి దం
ధనమార్జించెడి నాథుఁడే మృతిగన న్దద్భార్య మోదంబుతో
జనువున్గంటుఁ గృపారసంబుకిసమున్సాన్యం తానెనింకించుచున్.

ఉ. ఎందరు రాజులేగిరి మరెందరు పండితు లేఁగుచుండ్రి, వా
రందరు మంచిచెడ్డలు జయాపజయంబుల భూమినుంచి యీ

సుందర దేహయష్టి బహుశోభనయుక్తుల గూనుఁ గాన్ సతీ
మందిర విత్తజాలమహిమంబుల వీడుచు స్వర్గమేఁగరే! 32

మ. ఎడఁజింతించిన లాభమేమి! ప్రభువా! ఈలోకసంజాత ప్రా
ణదమున్ పోషకనాశకంబు మరణంబా! విజ్ఞులీ స్మృత్యువున్
మదిలో సంస్మరణంబొనర్చిపిలువన్ మాన్యంబు న్యాయ్యంబు నా
పదలన్ శోభనహేతువంద్రుగద! తాపంబందఁగా, జెల్లునే!

తే. అనుచు భర్తకు సుతునకు నార్యసూక్తు
లనువచించుచుఁ దత్సతి కనులు మూసె.
ప్రాణపోకడ వానల రాకడలిలఁ
దెలిసిన మహాత్ము లెవ్వరో! ధీరులుంద్రు. 34

సీ. నన్నయభట్టు కన్యాయము నేజేసి
తనదారిఁ బోయెన దలఁచువారు,
ప్రాణులకిద్దియే పరిపాటి యీ మొకఁ
గాలమాసన్నమ దలఁచువారు,
పతిభక్తిలో నరుంధతిసమ యనిమదిఁ
బలురకంబుల దుఃఖపడెడివారు,
ఆదర్శగృహిణి యీ యతివయేయని చెప్పి
మదిలోఁ దలంచుచు మసలువారు

తే. పసుపుకుంకుమతోడ నాపదఁతియేఁగె.
దీర్ఘ మాంగళ్య శోభన ధీరయీమె
స్వర్గమందున్న గౌరవజాలములను
బొందఁజాలదె! పతిభక్తి పూర్ణహృదయ! 35

వ. నన్నయ యిట్లు విచారింపసాగెను. 36

ఉ. వేసవిలేనికాలమును వెన్నెలలేని శశాంకుఁ డుర్విలో
వాసనలేనిపూవు పరివారము లేనినృపుండు సద్వచో
భ్యాసములేనినోరు, మరియాదయులేనిగృహంబు, భార్యతో
వాసవములేని కాపురము బంధువిహీననరుండు తుల్యమౌ.

తే. ధవుఁడు లేనట్టి సతిజీవితంబు వలెనె
నాతిలేనట్టి పతిజీవనంబు వృథయ
కర్మకయి పెండ్లియాడును గాని నరుఁడు
భేద మేమిటి? మిగిలిన విషయములకు. 38

తే. గృహమునకు దీపికయుగాదె గృహిణియనఁగ
గృహిణిలేనట్టి మనుజుని హృదయసీమ
శాంతియను వెల్గుపోవ విశ్రాంతిలేదు
అట్టినాచిత్తమున దుష్టి యుబ్బుటెట్లు?

సీ. మనసులోమాటను మఱుఁగు పెట్టకచెప్పి
ఎద శాంతిఁ గూర్చెడి దింతిగాదె!
కష్టసుఖములయందు ఘనుఁడవీవని పల్కి
యోదార్చు చుండెడి దువిదగాదె!
ఇంటికిరాగానె యెట్లుుంటిరి? మీకు
క్షేమమా! యనెడిది భామ గాదె!
తనయందచందముల్ మనసునకెక్కఁగా
సంతసంబిడునది జాయగాదె!

తే. ఎట్టిదారిద్ర్య తిమిరాన నిమిడియున్న
ఎట్టికష్టంబు వచ్చి చేఁబట్టియున్న
ధరణి సంసార సాగర తరణమందుఁ
గోరుపూరుషులకు నాక కోమలిగద!

తే. అట్టిభార్యను దాసిగ నాత్మనెంచి
వ్యభిచరించెడి వారల యముఁడు వేఁగఁ
గఱకు ఱంపాల గోయుఁడే! కడకు వాని
సతివియుక్తుని జేయుట పాడియగద! 41

వ. అని యీగతి విచారించు సమయాన, 42

మ. అల నారాయణభట్టు శ్లేష్మరుగ్జరోగాన స్రుఁగతుండయ్యె నా
విలచిత్తంబున నన్నిభట్టుస్మృతిఁ జెప్పెన్, పుత్రుఁడా! యంతలో
పలుఁదావచ్చిద దూరావ్యాదుఃఖమున సప్పాయించుఁ గంగారుతో
గలయంజూచుచు శైశ్యకృత్యము లొగి న్గావించె వేవేగమే.

వ. అంతవాగనుశాసనుండు లేచి యిట్లనియె:

చ. అఱువది నాల్గు వత్సరములా! గతియించిన యింతటి దన్క నాకు మున్
దఱచుగఁ గష్టగాథల వికారమువింటయెగాని స్వీయమై
పరఁగఁగలేదు నేటికిది ప్రాప్తిలె నారయఁ గష్టవార్ధి ని
స్తరణముఁ జెంద సాధ్యమగుదారి యెు? ధాతకువానితాతకున్.

సీ. చిన్నతనాన నచ్చెలికాఁడుగానుండి
మననువారించిన మాన్యుఁడెవఁడు?

విద్యార్థిదశయందు వివిధభాషల నేర్చి
మనసుహరించిన మాన్యుఁ డెవఁడు?
గార్హస్థ్యసుఖములఁ గలయఁజూచుచు నాదు
మనసుహరించిన మాన్యుఁ డెవఁడు?
విద్యాప్రసంగముల్ వెలయఁజేయుచు నాదు
మనసుహరించిన మాన్యు డెవఁడు?

తే. భారతగ్రంథరచన కపారమైన
సాయమొనరించి కీర్తి జయము నాకుఁ
గలుగఁ జేసిన జగజెట్టి కలియగాన
ఇంతకునుమించి కలకాలు మేటులనిల్చు? 46

ఉ. ఆతఁ డదృష్టవంతుఁడు మహామహిమాత్ముఁడు గాన స్వర్గతుం
డాతనిజావుతోడ హృదయంబున వేదనబొంది యిట్టు లా
పాతసతీవియోగభర పాపశిశిన్నహృదంతరాళ సం
జాతవికారవీచితుఁడఁ జావక యుంటిని మొండికట్టనై. 47

వ. అనఁగఁ జిన్నయ యిట్టులనియెను:

సీ. సంస్కృతభాషలో సాటిలేని బుధుండు
కన్నడభాష లోఁగొన్న వాఁడు;
తెలుఁగుబాసకు దిట్ట; ధరతసిమూఁడు
భాషలకవితలోఁ బరమసుకవి
రాజకీయపుదంత్రరాజనెత్తఁగిన యమ
మాత్యపదవిచేత మాన్యుఁడితఁడు;

అలఘుణాత్రయము నత్యంత భక్తిని దీర్చి
శివసన్నిధినిఁ గొన్న శిష్టుఁడితఁడు;

తే. దానధర్మాల దీనులఁ దనుపువాఁడు;
ఆంధ్రభారత కృతిసహాధ్యాయి యేఁడి?
భారతీయుల దురదృష్టవశత మృతుఁడు
నన్ని నారాయణుని సాటి యెన్నఁగలమె! 49

తే. కలఁత విడనాడి భారత గ్రంథరచన
పూర్తి చేయుము జనకుఁడ! పోవువారు
ధన్యతములయ్య! వారిని దలఁచుకొనుచు
పుణ్యకార్యాల విడతురా? పురుషవరులు. 50

తే. బాలుఁడనె! యైన నొకమాట పలుకుచుంటి
కష్టపడి వేగ భారతగ్రంథమునకు
బాట నేర్పరచితి కొంతవఱకు నీవ!
ఆక్రమింపరె! యన్యజనాళి దీని. 51

తే. ఏదియేమైన కష్టంబు లెన్నికలుగ
దివికి మిత్రముపోయినఁ దెఱవకూడ
గోరి చెంతకు నేఁగిన గడమభాగ
మంతయును బూర్తి చేయుచోఁ జింతలేదు. 52

వ. అంత నన్నయ యిట్లనెను — 53

తే. భారతము భారతమటంచుఁ బలికెదింక
నేటిభారత రచన! మనీషివర్య
నన్ని నారాయణునితోడ నాకమేఁగెఁ
జావుబ్రతుకుల మధ్యలో సాధ్యమగునె! 54

వ. రాజరాజ విచారముతోఁ బ్రవేశించి 55

శా. ఈవే ప్రాణమునాకు నన్నయ మనీషీ! నీకు సాటెవ్వరీ
భూవంద్యాత్ములు బ్రాహ్మణోత్తములనంభోమధ్య దేశంబులో
నీవాల్లభ్యముగోరు భార్యమరణోన్నీతాత్మ, నారాయణుం
డావంతేనియుఁ జూడకుండ దివికావా! పోయెనెట్లోర్తువో! 56

మ. మొఱ్ఱడై పోయెను దైవమింక, ఘనతా మూర్ధన్యపుణ్యంబులో!
తిరుగన్నేరకపోయెఁ గష్టదశ! యుత్తేజించె సంబంధులా!
మఱియు న్దూరగులైరి, జీవిక యునన్నందంబుగానయ్యె, హా!
మఱువన్శక్యమె! యీ వియోగభరమున్మోదంబుగాదే!సఖా!

ఉ. పుట్టిన దానికి న్సరిగఁ బూర్ణ ఫలంబులు రెండుగావె! యె
వ్వట్టున లోటులేని జనపాలకతాభరమూను టొక్కటొ,
పట్టగరానివేగము సభాముఖమందు రసంబునిల్పి సం
ఘట్టిత పాకశయ్య గల్కైత ద్వితీయముగాదె! భూమిలో. 58

తే. మహిత కవితా ప్రియుండవై మసలుచుండి
వెతలలోఁ జిక్కుగొన్న జీవితము జూచి

చింత సేయక భారతి సేవ యింక
సలుపఁదగునయ్యా! నన్నయ్యా! సైఁపుమయ్యా! 59

తే. ధీరతయనంగ నిట్టిదే దేహికెపుడు
కష్టసుఖముల వినిమయ ఘనత కలుగు
దానికిం బట్టువడక నిదాన బుద్ధి
మొదలుపెట్టిన బనిచేయు ముఖ్యమగును. 60

వ. అన నన్నయ యిట్టులనియె. 61

తే. మొదలుపెట్టిన బనిచేయు ముఖ్యమగును,
కవిత సామాన్య కృతిగాదు. కలయఁజూడ
భార్యగతియించె మిత్రమా! పైకిఁబోయె,
ఇట్టిసమయాన నిశ్చలమెట్లు లుండు? 62

సీ. తిండికిలోటు లేకుండగ ధాన్యము
వచ్చుభూవసతియే వరలుచుండ
దరలిననేమి? యావనిత వినుగులేక
అతిథుల దన్పెడి దగ చునుండ
దనిపిననేమి! సత్తనయులు నిలుచక్క-
పెట్టుకొనుచుఁ దాము పెరుఁగుచుండ
పెరిగిననేమిటి? విద్వాంససఖుఁడుండి
యొప్పుతప్పులనెల్లఁ జెప్పుచుండ

తే. ముసలితనమందుఁ గష్టముల్ మోదకుండ
విన్నుబోలినరాజు మన్నించుచుండ
మనను సంతోషవీధిలో మసలుచుండ.
భార్య పాదాలచెంతనే పరఁగుచుండ. 63

తే. ధారగావచ్చుఁ గవితఁ దాఁ దప్పకుండ
కవనమల్లుట సామాన్య కార్యమగునె?
భారతమునందు నీకున్న పరమభక్తి
నాకుఁగూడను గలదయ్య, నరవరేణ్య! 64

ఉ. భారతమం దరణ్య మనుపర్వము కష్టసమూహదంబు, నీ
కోరికచేత నింతవరకున్ రచియించితి, ముందుజన్మలో
నారయ నీవురాజువగు దప్పకు నేను కవీశనామతో
భారతమంతఁబూర్తియగుభారముఁదాల్చెదనించుమించుగా.

తే. ఇట్టులంటినటంచు నీవెంచఁబోకు
అంతకాధార మీకాలమగును గాదె!
భారతమదింతదాకనే వరలఁగవలె
ననెడిదైవాజ్ఞదాటగా నగునె? భూప! 66

వ. అనుచు నిఱువురు సుఖముగా నుండిరి. 67

మ. భగవంతుండు కటాక్షముంచవలెనాపాటుల్ స్వవిద్యాప్రలై
జగమందు న్విలసిల్లగావలయు నీసాయంబె నాకుండెడిన్

వగలన్జూపి కవిత్త్వమే కవులనున్ భక్తాళిఁ జేయుచున్సదా
ఖగవాహుండు నరిష్టజాలములబోఁగాఁద్రోలి రక్షించెడిన్.

తే. స్వామి! విఘ్నపతివి! నీకువందనంబు
కనకరాజును నన్నును కలిపిబ్రోవు
అతఁడు, రోగములంద్రోలు నట్లు. నేను
నతని చరితము వ్రాయునట్లొప్పగాను. 68

ఇట్లు చిలుకూరి రామభద్రశాస్త్రి విరచిత
నన్నయభట్టారక చరితమున
బంచమాశ్వాసముతో
సర్వంబును
సంపూర్ణము

ఇడగ ఋద్ధిలక్ష్మీగణపత్యర్పణమస్తు
ఓం
శాంతిః

---

సరస్వతి పవర్ ప్రెస్, రాజమహేంద్రవరము 6031/1950.